# 1. చదువు కోరిక

అచ్చుచ్చుర పిల్లవాడు చిచ్చుర పిడుగే !
అచ్చమైన ఊరిలోన బుచ్చి బాలుడే !

ఎండినట్టి తుమ్మకాయ నేరుకొచ్చెనే !
ఇరిచి గడ్డి తీగ తోని గజ్జెలల్లెనే !
గమ్మత్తైన తుమ్మ గజ్జె ఘల్లుమన్నదే !
ఆట జూస్తె జానపదుల అందమున్నదే !

తీగమల్లె పువ్వు లిరిసి పీకె చేసెనే !
పీప్పీపి పిల్లలారా రండి అన్నడే !
తాటి కమ్మ చీరి గాలి గిర్ర చేసెనే !
తోటివాళ్ళ కిచ్చి తిరిగి రమ్మనంటడే !



గడ్డిపూలు పేనీ గడియారమల్లెనే !
గంట చూసి బడికి తాను పోతనంటడే !
ఈత కమ్మలల్లి మంచి బొమ్మ చేస్తడే !
రాత రాయమంటు సుద్ద చేతికిస్తడే !

పుటపుటాల మేరుకొచ్చి కఱ్ర బొగ్గ్లనే
కలిపి కాటికోలె దంచి పలక కంటడే !
సక్కనైన రొట్టె పెంక పలక మీదనే
సుద్దముక్క తోటి రాత రాస్తనంటడే !

చొప్పదండు తెచ్చి చీరి పుల్లలిరిసెనే !
చొప్పబెండు కేసికుచ్చి బండి చేసెనే !
బంతిపూల చెండ్లు బండి పయ్యలంటడే !
బండి మీద రండి బడికి పోదమంటడే !

**- భూపాల్**



# 2. ఎవరు గొప్ప?

కొండ : ఉడతా ! ఉడతా ! చిన్నారి బుడతా !
వింటావా నా గొప్ప వివరించి చెబుతా !

అబ్బబ్బ! నా ఎత్తు ఆకాశమంత
అహ్హాహా! నా గొప్ప చెప్పలేనంత
నా ముందు నువ్వెంత?
కంటిలో నలుసంత!

నాపైన పెరిగేటి చెట్టుపుట్టలు చూడు !
నాపైన పడివున్న బండరాళ్లను చూడు!

నిన్ను మోసేది నేనే ఓ ఉడతా!
నువ్వు తిరిగేది నాపైనే ఓ బుడతా!

అబ్బబ్బ! నా ఘనత
ఓపలేనంత
అహ్హాహా! నా బరువు
మోయలేనంత
నా ముందు నువ్వెంత ?
ఓ చిన్న రాయంత !



ఉడత :

బండరాళ్లను మోయు కొండన్నా !
బడాయి మాటలు వద్దన్నా
ఉడతనే బుడతనే
కాదనను నేను
నీ ఎత్తు నీ లావు
ఒప్పుకుంటాను!

బుడతనైనా నేను
పరుగెత్తుతాను
చెట్టుకొమ్మలపైన
గంతులేస్తాను!

నాలాగ అటుఇటూ
నడవగలవా నువ్వు?
కాయలను కమ్మగా
కొరికి తినగలవా?

నాకన్న నువ్వెంతో
పెద్దవాడివె కాని
నీకన్న నేనెంత
చిన్నదాన్నో చూడు !

నీ గొప్ప నీదే
నా గొప్ప నాదే
కొండన్న ఈ నిజం
తెలుసుకో అన్నా!!

## ఇవి చేయండి.

అ. మీలో ఒకరు కొండగానూ, మరొకరు ఉడతగానూ నటిస్తూ గేయాన్ని లయబద్ధంగా పాడండి.

ఆ. ఉడతా! బుడతా! చెబుతా! - గేయంలో ఇలా ఒకే రకంగా పలికే పదాలను గుర్తించి పలకండి.

# 3. అవ్వ - బువ్వ

సాయంత్రం దోస్తులతో ఆడుకుంటున్నా. చాలా సేపయింది. చీకటి పడుతూంది. ఇంకా ఆడుకుంటూనే ఉన్నాం. ఇంతలో అవ్వ వచ్చి పిలిచింది. నాకు చిరాకేసింది. "చీకటిపడినా ఇంటికి రావేం ! వచ్చి స్నానం చెయ్యి, బువ్వ పెడతా" అంది అవ్వ.

అయిష్టంగానే ఇంటికెళ్లి స్నానం ముగించా. ఇంతలో అవ్వ అన్నం పళ్లెం తెచ్చింది. పళ్లెం ముందు కూర్చున్నా. బువ్వ తెల్లగా లేదు. చల్లగా ఉంది. నాకు కోపం పెరిగి పోయింది. పళ్లాన్ని విసిరికొట్టా. ఇంకేముంది ! సరిగా ఆ పళ్లెం గిరగిరా తిరుగుతూ మూలన కూర్చున్న అవ్వ ముఖాన్ని తాకింది. అవ్వ ముఖమంతా అన్నంతో అలికినట్టయిపోయింది. కోపం ఎక్కడ దాక్కుందో నవ్వలేక చచ్చిపోయాను.

అవ్వకు కోపం రాలేదు. కోపం వచ్చినా భయపడతానా ? ఊహు ! ఆ ముసలవ్వకు మూడు కాళ్లతో నడిచి నన్ను పట్టుకోడం చేతకాదు. పాపం పైకి లేచి, ముఖం కడుక్కుని, నాదగ్గర కొచ్చి కూర్చుంది. ఇంకో పళ్లెంలో బువ్వ పెట్టుకొచ్చి కలుపుతూ చెప్పింది.

"ఓరేయ్ పిచ్చి నాయనా ! బువ్వ ఊరికే వస్తుందనుకున్నావా ? ఈ బువ్వ మనకు రావడానికి ఎంత కష్టం చేయాలో తెలుసా ? ఎందరో మనుషులు, ఎన్నో పశువులు కష్టపడితే, ఇది మన నోటి వరకొస్తుందని తెలుసుకో ! "

నాకేం తెలుసు. మా నాన్న డబ్బులిస్తే మా అన్నయ్య పట్టుకొస్తాడు బియ్యం. అంతేగా ! దాని కోసం ఎందుకు కష్టపడాలి అనుకున్నా ! అవ్వ అంది గదా -

"మొదట భూమికి నీళ్లు పెట్టి బాగా దున్నాలి. ఆకు ఎరువు, పశువుల ఎరువు ఎంత ఎక్కువ వేస్తే అంత మంచిది.... పొలాన్ని దున్నడమంటే సామాన్యం కాదు. మనుష్యులు చెమటతో తడిసిపోతారు. ఎద్దుల ఒళ్లు గుల్లయిపోతుంది. ఇంతా చేశాక వడ్లు మొలకెత్తాలి. మొలకెత్తిన తర్వాత నారు పీకి పొలంలో నాటాలి."

అవ్వ పళ్లెంలో అన్నం కలిపి ముందుపెట్టింది. అన్నం తినటం మొదలుపెట్టా - అవ్వ చెప్తూ ఉంది.











"ఆ పైరు ఎదగాలంటే ఎప్పుడూ నీళ్లుండాలి. మరి నీరు ఊరికే రాదుగా. మోట తోలాలి. ఏతాం వేయాలి. కాలువలో ఇసుక తీయాలి. పైరులో ఎదిగే కలుపు మొక్కలను తీయడం ఎంత కష్టమనుకున్నావు ! ఉదయం మొదలు చీకటి పడేవరకు నడుము వంచుకునే పని చేయాలి."

అవ్వ చెబుతూనే ఉంది. తింటూనే వింటున్నా !

"వెన్ను పట్టాక పిట్టలతో, ఎలుకలతో రోజూ పోరాటం ! పిట్టలు గుంపులు గుంపులుగా దండెత్తి వస్తాయి. ఎలుకలు కన్నాలు పెడతాయి. ఈ పంట కోయడానికి, కొట్టడానికి మనుషులు ఎందరో కావాలి ! గింజలు రాలగొట్టడానికి రెక్కలు ముక్కలవుతాయి.

గింజలు రాలాక వాటిని ఎండబెట్టి, దంచి, అమ్మితే, బియ్యం అంటూ తెచ్చుకుంటున్నాం. ఇందరు మనుషులు, పశువులు కష్టపడి పండించిన పంట - అమ్మ జాగ్రత్తగా వండిపెడితే పారేశావు ? ఊరికే వస్తుందా ?".

అపాటికే బువ్వ అయిపోయింది. పళ్లెంలో ఒక్క మెతుకు కూడా విడిచిపెట్టలేదు. అంతే ! నాటి నుండి బువ్వను చిందేయడం, పారేయడం మానేశాను.

-కె. సభా

## ఇవి చేయండి.

అ. చిత్రం చూసి పది వాక్యాలు చెప్పండి.



ఆ. 1. **ఈ కింది పదాలను క్రమంలో రాస్తే పాఠంలోని ఒక పేరా అవుతుంది. కానీ ఈ పేరాలో ఒక పదాన్ని ఇవ్వలేదు. ఆ పదాన్ని గుర్తించి పేరాను సరిగా రాయండి.**

"నోటి ఊరికే బువ్వ ఇది మన ఒరేయ్ ఎంత కష్టం పిచ్చి నాయనా ! రావడానికి తెలుసుకో ! చేయాలో ఎందరో తెలుసా? మనుషులు ఈ బువ్వ మనకు పశువులు ఎన్నో వరకొస్తుందని వస్తుందనుకున్నావా?

2. **పాఠం చదవండి. కింది ప్రశ్నలకు ఒక్కొక్క పదంతో సమాధానం రాయండి. ఎవరు ముందుగా రాస్తే వారు గెల్చినట్లు.**

1. రెండవ పేరాలోని ఒక విశేషణం రాయండి.

2. ఇంటికి వెళ్లగానే పిల్లవాడు ఏం చేశాడు?

3. గుంపులు గుంపులుగా ఏవి దండెత్తి వస్తాయి?

4. 'చిలుక'లో మొదటి అక్షరం తొలగించి ఒక అక్షరం చేరిస్తే జంతువు అవుతుంది. అదేమిటి?

'తోటమోలాలి' అక్షరాలు తారుమారైనవి. ఈ పదమేమిటి?

6. 10వ పేరాలో 'రెక్కలు' అనే పదానికి అర్థం ఏమిటి?

7. 'అజాగ్రత్త'కు వ్యతిరేక పదం ఎన్నో పేరాలో ఉంది? దానిని రాయండి.

8. పాఠంలో ఎక్కువ అక్షరాలున్న పదమేది?

ఇ. ఈ కింది పదాలను ఒకే వాక్యంలో ఉంచి, సొంత వాక్యాలు రాయండి.

1. చీకటి, చిరాకు
2. చీకటి, చిరాకు, భయం
3. మోట, తోట, పిట్ట
4. ఉదయం, రెక్కలు, ఎలుకలు
5. కోపం, పాపం, కలుపు

ఈ. చిత్ర పద క్రీడ

కింది చిత్రాలలో ఒక అక్షరం ఇవ్వలేదు. ఆ అక్షరం ఉపయోగిస్తే పదాలు ఏర్పడతాయి. వాటిని రాయండి.

ఉదా: అరటి + వ్వ - బు + మువ్వలు = అవ్వ-బువ్వ

1. _లక + శు + ఆ_ + లు =

2. _కు + కా_ + కొను =

3. అభి + _మిడి + _ది =

4. అభి + కా_ + _లక =

# 4. పల్లెకు పోదాం



"శ్రీ లతా! క్షేమంగా వెళ్లిరా తల్లీ ... అందరినీ అడిగానని చెప్పు. రేపు ఉగాదికి అందరూ ఓసారి వచ్చిపొండి. ఈ ఊళ్లో పండుగ చాలా బాగా చేస్తారు" బస్సు కదలబోతుండగా కిటికీ వద్ద నిలబడి అంటోంది సీతమ్మత్త. ఆమె గొంతులో అంతులేని ఆప్యాయత.

"సరే అత్తా, ఉత్తరం రాస్తాలే" కిటికీలోంచి చూస్తూ చేయి ఊపింది శ్రీలత. తనను సాగనంపడానికి కుటుంబంలోని వారంతా తరలి వచ్చారు. తమ దగ్గరి బంధువుల పిల్లలు కూడా వచ్చారు. ప్రకాశం మామయ్య వచ్చాడు. రమణ, పార్వతి, పద్మ, బుజ్జి, చంటి ... వీళ్లంతా వచ్చారు. వానర సైన్యం ! దారిలో ఎంత అల్లరి చేశారో !

చిరునవ్వులతో వీడ్కోలు చెప్పారు. చేయి ఊపుతున్న తమ నేస్తం కనుమరుగయ్యేంతవరకు అలా చేతులు ఊపుతూనే ఉన్నారు...

బస్సు ఊరి పొలిమేర దాటింది ...

ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణాన్ని విడిచి వెళ్తుంటే శ్రీలతకు ఏదో పోగొట్టుకున్నట్లుగా ఉంది.

బస్సులో తన కాళ్ల పక్కన సీతమ్మత్త సర్దిపెట్టిన సంచులు ఉన్నాయి. ఒక సంచినిండా వాళ్ల చేలో పండిన కూరగాయలు, మరో సంచి నిండా పండు మిరప కాయలు. సీతమ్మత్తగారి మిరప తోట తన కెంత నచ్చిందో ! చెట్లకు వేళ్లాడుతూ పండు మిరపకాయలు ఎంత అందంగా ఉన్నాయో!

"ఇవన్నీ ఎక్కడ మోసుకు వెళ్లేదే - అత్తా !" అంటే వింటేనా? "నువు మోసేదేముంది కోడలా! బస్సులో కూర్చుంటే గంటలో వెళ్లిపోవూ? ఆ తర్వాత చక్కా రిక్షాలో వెళ్లొచ్చు" అంది.

బస్సు వేగంగా కదలిపోతోంది. శ్రీలత మనస్సులో ఆలోచనలు అంతకన్నా జోరుగా సాగిపోతున్నాయి...

తాను సంక్రాంతి సెలవులు గడపడానికని ఆ ఊరు వచ్చింది. గతంలో ఎప్పుడో ఊహ తెలియక ముందు వచ్చింది. మళ్లీ ఇప్పుడు ! అదీ అమ్మ పోరు పడలేక. "సెలవులే కదా. సీతమ్మత్తను ఓసారి వెళ్లి చూసి రారాదూ" అంటూ చెవిలో ఇల్లు కట్టుకు మరీమరీ చెప్పింది. తనకు వెళ్లడం అంతగా ఇష్టం లేదు. ఎందుకంటే సీతమ్మత్త వాళ్లది చిన్న పల్లెటూరు! పైగా పట్నం పిల్లనని తనకు కొంచెం టెక్కు ఉందేమో! అయితేనేం? ఆ టెక్కు కాస్తా ఇప్పుడు ఎగిరిపోయింది.

ఏమాట కామాటే చెప్పుకోవాలి. తనను ఎంత ఆకర్షించిందో ఆ పల్లెటూరి జీవితం! రణగొణ ధ్వనులు లేని ప్రశాంత వాతావరణం, చక్కగా అలికి ముగ్గులు పెట్టిన ఇళ్లు, మనుషుల్లో చక్కటి కలివిడి తనం. ప్రకృతి మాతకు పచ్చని చీర కట్టినట్లు ఊరి చుట్టూ కన్నుల పండుగ చేసే పంట చేలు, చెంగు చెంగున చెంగలించే కోడె దూడలు, కాడి కట్టిన ఎద్దుల మెడల్లో గణగణ మోగే మువ్వల సవ్వళ్లు, కల్లాకపటం లేని కర్షకులు, ఆప్యాయత నిండిన వారి పలకరింపులు .....



... ఆ రోజు బస్సు దిగి చేతిలో చిన్న సూట్‌కేసుతో తాను నడిచి వస్తోంది. దారి పొడవునా ఎవరో ఒకరు తనను పలకరిస్తూనే ఉన్నారు. "ఎవరమ్మాయివమ్మా? ఎవరింటికమ్మా?" అంటూ. తన హృదయం ఎంత పులకరించిందో! వాళ్ల పలకరింపులో అమృతం ఉంది. వెంకటేశు బాబాయ్ అల్లంత దూరం నుండే తనను గుర్తు పట్టాడు. తన చేతిలోని సూట్‌కేసును తీసుకొని "సీతమ్మత్త ఇల్లు గుర్తుందా అమ్మాయి?. నేను దిగబెడతాను పద ..." అంటూ వెంట వచ్చాడు.

అక్కా, బావా, పెద్దయ్యా అంటూ ఊళ్లో వాళ్లంతా ఎంత చక్కగా వరసలు కలుపుకుంటారు! తమ పట్నంలో అయితే పక్కింట్లో వుండేవాళ్లను కూడా పట్టించుకోరు. ఎవరి బతుకు వాళ్లదే. ఎవరి తొందర వాళ్లదే.



తాను సరిగ్గా పది రోజులు గడిపింది - ఆ పల్లెటూళ్లో. పది రోజులూ పది నిముషాల్లా దొరలిపోయాయి. గుడి ముందు ఆరు బయట వెన్నెల్లో ఆడపిల్లలందరూ కలసి ఆటలాడుతుంటే ఎంతో సరదాగా ఉంది. బుజ్జిగాడితో కలిసి పంట చేలకు కావలా వెళ్ళడం ఎంత బాగుంటుందో! పొలం గట్టున చింత చెట్టు కింద కూర్చొని, అత్తమ్మ కట్టిన అన్నం మూట విప్పుకొని తింటుంటే - ఎంతైనా తినాలనిపించేది. పచ్చని ప్రకృతి మహిమో? ఏమో!

పొలాలను తడిపే నీటి కాలువలు, ప్రాణవాయువును నింపుకొని హాయిగా వీచే పైరగాలి. వినీల గగనంలో ఎగిరే అందమైన రంగురంగుల పక్షులు ...

పట్నంలో ఇవన్నీ ఎక్కడివి? కార్లూ, మోటార్లూ, సినిమాలూ, హోటళ్లూ, హడావిడీ తప్ప! పట్నంలో తాను ఎప్పుడైనా అందమైన సూర్యోదయం, సూర్యాస్తమయం చూసిందా? రాత్రి సమయంలో వినీలాకాశంలోని నక్షత్రాలు చూసిందా? కొలనులో విరిసిన తామర పూలను చూసిందా?

తమ ఊరు చేరేవరకు ఇవే ఆలోచనలు శ్రీలతకు. బస్సు ఆగి కండక్టరు గుర్తు చేసేదాకా తన ఊరు వచ్చినట్లు తెలియనేలేదు !

గంపెడు సంతోషంతో ఇంటికి చేరింది శ్రీలత. "రెండ్రోజుల్లో తిరిగి వస్తావనుకుంటే సెలవులు అయిపోయేదాకా అక్కడే వున్నావేమిటి?" అంది తల్లి.

"రాబుద్ధి కాలేదమ్మా. ఇక నుండి సెలవులు వచ్చినప్పుడల్లా పల్లెటూళ్లోనే గడిపేయాలని ఉంది" అంటూ శ్రీలత నవ్వుతూ తల్లిని వాటేసుకుంది.

## ఇవి చేయండి.

అ. మీరు ఏదైనా ఊరు వెళ్లివచ్చినప్పుడు, ఆ ఊరిలో మీకు నచ్చిన విషయాలను మీ మిత్రులతో చర్చించండి.

ఆ. పర్యాయ పదం అంటే ఒక పదానికి అదే అర్థం వచ్చే మరొక పదం. కింది వాక్యాల్లో గీత గీసిన పదాలకు బదులుగా ఏ పదాలు వాడవచ్చో చెప్పండి. ఆ పదాలతో వాక్యాలు తిరిగి రాయండి.

ఉదా॥ చెట్టు = వృక్షం, తరువు

1. ఆమె గొంతులో అంతులేని ఆప్యాయత.
2. చేయి ఊపుతున్న తమ నేస్తం కనుమరుగయ్యేంతవరకు అలా చేతులు ఊపుతూనే ఉన్నారు.
3. వినీల గగనంలో ఎగిరే అందమైన రంగురంగుల పక్షులు.
4. కొలనులో విరిసిన తామరపూలను చూసిందా?

ఇలా బయలుదేరిన కోడిపిల్లకు అల్లంత దూరంలో "కావ్! కావ్!" అంటూ ఒక కాకి కన్పించింది. మేక మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని ఆ కాకి తన తల్లి అయి ఉంటుందని "నీకు రెండు కాళ్లు, రెక్కలు ఉన్నాయి, మా అమ్మవు నీవేనా?" అని కోడిపిల్ల అడిగింది. అప్పుడు ఆ కాకి "నాకు రెండు కాళ్లు, రెక్కలు ఉన్నాయి నిజమే. కానీ నేను మీ అమ్మ కంటే ఎక్కువ ఎత్తు ఎగురగలను. మీ అమ్మ నాకంటే పెద్దగా ఉంటుంది. కాళ్లు కూడా పొడవుగా ఉంటాయి. నాలాగా మీ అమ్మ అరవదు" అని అంది. దాని మాటలు విన్న కోడిపిల్ల నిరుత్సాహపడింది. నిరాశగా, దిగులుగా ఉన్న కోడిపిల్లను చూసి కాకికి కూడా జాలేసింది. కోడిపిల్లతో కాకి "నీవు నిరుత్సాహపడకూడదు, ముందుకు వెళ్లి ప్రయత్నించు, మీ అమ్మ నీకు తప్పకుండా కలుస్తుంది" అని చెప్పి ఎగిరిపోయింది.



కాకి మాటలతో తిరిగి ఉత్సాహం తెచ్చుకొని చిట్టి చిట్టి అడుగులు వేస్తూ, చెరువు గట్టుపై నడుస్తూ వెళ్లింది. అక్కడ 'క్వాక్! క్వాక్!' అంటూ బాతు కనిపించింది. కాకి చెప్పిన పోలికలు బాతులో కనిపించేసరికి కోడిపిల్లలో ఉత్సాహం ఉరకలు వేసింది. "అమ్మా!" అంటూ బాతు దగ్గరికి పరుగెత్తింది. బాతు విచిత్రంగా కోడిపిల్లను చూసింది. "ఏమిటమ్మా! అలా చూస్తావు? నేను నీ బిడ్డను" గోముగా కోడిపిల్ల పలికింది. "అయ్యో తల్లీ! నేను మీ అమ్మను కానమ్మా!" అని బాతు అంది. ఆ మాటలకు ఖంగుతిన్న కోడిపిల్లకు దుఃఖం పొంగుకు వచ్చింది. వెక్కివెక్కి ఏడిచింది. తన తల్లిని కనుక్కోలేనేమోనని భీతి చెందింది. కోడిపిల్ల ఏడుపు చూసిన బాతు గుండె కరిగింది. లాలనగా "ఎందుకమ్మా అంతగా ఏడుస్తున్నావు? చెప్పు" అని కోడిపిల్లను బుజ్జగించింది. ఊరడిల్లిన కోడిపిల్ల వెక్కుతూ, వెక్కుతూ జరిగిందంతా చెప్పింది. ఆ మాటలు విన్న బాతు "మీ అమ్మ నాలా క్వాక్! క్వాక్! అనదు. కో...క్కొ...క్కొ...క్కో... అంటుంది" అని చెప్పింది.

చెట్టు పైనుండి సంభాషణంతా వింటున్న పావురం వీరి దగ్గరికి వచ్చి వాలింది. పావురానికి కోడిపిల్లకు సహాయం చేయాలనిపించింది. "ఈ చెరువు గట్టు చివరకు వెళ్లు, అక్కడ నీకు మీ అమ్మ కనిపించవచ్చు" అని చెప్పి పావురం ఎగిరి వెళ్లింది.

పావురం చూపిన దిశగా చిక్... చిక్... అంటూ కోడిపిల్ల వెళ్లింది. కాస్తంత దూరం వెళ్లేసరికి 'కో...క్కొ...క్కొ...క్కో...' అన్న శబ్దం విన్పించేసరికి కోడిపిల్ల ఆనందంగా అటువైపు చూసింది. రెండు కాళ్లు, రెండు రెక్కలతో, కాకి కంటే పెద్దగా ఉండి, కో...క్కొ...క్కొ...క్కో... అంటున్నది కాబట్టి, తప్పకుండా తన అమ్మే అయి ఉంటుందని నిశ్చయించుకొంది. "అమ్మా! అమ్మా! ఛిక్... ఛిక్... ఛిక్..." అంటూ పిలిచింది. ఆ పిలుపుకు వెనుదిరిగి చూసిన కోడి, కోడిపిల్లను చూసి ఆగింది. తన పిల్లను గుర్తించింది. దగ్గరకు రమ్మని క్కో... క్కో... క్కో... అంటూ పిలిచింది. తన తల్లిని కనుక్కున్నందుకు కోడిపిల్ల ఆనందానికి అవధుల్లేవు. సంతోషంగా, తన చిట్టిచిట్టి రెక్కలతో ఎగురుతూ తన తల్లిని చేరుకుంది. కోడిపిల్లను అనురాగంతో కోడి తన రెక్కల్లో ఇముడ్చుకుంది. కోడిపిల్ల తల్లి ఒడిలో ఒదిగిపోయింది. "అక్కడే ఉండక నాకోసమని వెదుకుతూ ఎందుకు బయలుదేరావమ్మా! మీ ఆహారం కోసమే నేను వచ్చాను. ఎలాగూ తిరిగి వచ్చేదాన్ని కదా!" అని కోడి తన పిల్లతో అంది. తన పిల్ల తననే వెదుకుతూ ఎలా చేరుకుందో తెలుసుకోవాలని కుతూహలంగా ప్రశ్నించింది. కోడిపిల్ల జరిగిందంతా తన తల్లికి ముద్దుముద్దుగా అభినయిస్తూ, చిన్నచిన్న మాటల్లో వివరించింది. ఆ మాటలు విన్న తల్లికోడి, తన పిల్ల తెలివికి, పట్టుదలకు అబ్బురపడింది.



## ఇవి చేయండి.

అ. చెప్పండి.

కింది మాటలు ఎవరు ఎవరితో అన్నారు?

ఎందుకు అన్నారు?



1. ఎంత పెద్దగా ఉన్నానో
2. నిజమే ... మే ... మే ...
3. ఎక్కువ ఎత్తు ఎగరగలను.
4. అయ్యో తల్లీ !
5. అమ్మా ! అమ్మా !
6. ఎలాగూ తిరిగి వచ్చేదాన్ని కదా !

ఆ. 1. ఇచ్చిన సూచనల ఆధారంగా పదాన్ని పాఠంలో గుర్తించండి. ఆ వాక్యాన్ని రాయండి.

- ఇది నాలుగు అక్షరాల పదం.
- మొదటి అక్షరానికి 'ౢ' ఒత్తు ఉంటుంది.
- చివరి రెండక్షరాలతో ఏర్పడే పదానికి అర్థం 'ప్రజలు'.

2. పాఠంలో కొన్ని అనుకరణ పదాలు ఉన్నాయి. ఆ పదాలు ఉన్న వాక్యాలు రాయండి.

ఉదా॥ అప్పుడు కోడిపిల్ల ముద్దుముద్దు మాటలతో "మా అమ్మవు నువ్వేనా?" అని అడిగింది.

ఇ. 1. పదాలను అకారాది క్రమంలో రాస్తే వాటి అర్థాలు తెలుస్తాయి.

| పదం | అర్థం |
|---|---|
| ప్రయోజనం | హద్దు |
| ప్రారంభించు | ఉరుకు |
| బేలతనం | లాభం |
| సమాధానం | మొదలుపెట్టు |
| పరుగెత్తు | అమాయకత్వం |
| శబ్దం | భయం |
| భీతి | ధ్వని |
| అవధి | జవాబు |

2. పాఠంలో ఒకే అర్థం గల పదాలు ఉన్నాయి. వాటిని గుర్తించి రాయండి.

ఉదా॥ అగుపడు - కనిపించు

3. ఖాళీలను సరైన పదాలతో నింపండి.

(అవధులు, తడవు, ఆశ్చర్యం, నిశ్చయించు, పట్టుదల, ప్రారంభించాడు)



విష్ణుకు సైకిలంటే ఇష్టం.

తనే డబ్బులు దాచుకొని, కొనుక్కోవాలని __________ కొన్నాడు. అనుకున్నదే __________గా నాన్న, అమ్మమ్మ, మామయ్యలు ఇచ్చే డబ్బులను దాచుకోవడం __________ . __________గా డబ్బులను పొదుపు చేయడం చూసి అందరూ __________ చెందారు. ఇలా పోగు చేసుకొన్న డబ్బులతో సైకిల్ కొనుక్కున్న విష్ణు ఆనందానికి __________ లేవు.

## 9. బంగారు పాప



ప్రజ్ఞ చాలా తెలివైన అమ్మాయి. బడిలో టీచర్లకు, ఇరుగుపొరుగు వారికి, తోటి పిల్లలకు ఆమె అంటే ఎంతో ఇష్టం. ప్రజ్ఞ వాళ్ల నాన్న ఆమెకు అప్పుడప్పుడు ఒక రూపాయి ఇస్తుండేవాడు. వాటిని ప్రజ్ఞ ఖర్చు పెట్టకుండా దాచుకునేది. అలా కూడబెట్టిన రూపాయలతో ఒక అందమైన విమానం బొమ్మ కొనుక్కోవాలని ఆమె కోరిక.

ప్రజ్ఞ బడికి వెళ్లే మార్గంలో ఒక చింతచెట్టు ఉంది. ఒక రోజు ఆ చెట్టు కింద కొయ్యబొమ్మలు తయారు చేసే దుకాణం వెలిసింది. ప్రజ్ఞ ఆ దుకాణంలోని బొమ్మలు చూడాలని వెళ్లింది. అక్కడ రకరకాల బొమ్మలు ఉన్నాయి. వాటిలో జిరాఫీ, ఏనుగు, కోతి, పులి బొమ్మలు చాలా అందంగా ఉన్నాయి. వాటిని ప్రజ్ఞ ఆశ్చర్యంతో తదేకంగా చూడసాగింది. బొమ్మలు తయారు చేయడానికి కర్రను చెక్కుతున్న రహీం ఆమెను చూశాడు. "పాపా! ఏం కావాలి? బొమ్మలు బాగున్నాయా?" అని అడిగాడు. ప్రజ్ఞ తేరుకుని "చాలా బాగున్నాయి తాతా! బొమ్మలంటే నాకు ఎంతో ఇష్టం. అందులో 'కీ' ఇస్తే నడిచే విమానం బొమ్మంటే మరీ ఇష్టం, అది ఉందా?" అని అడిగింది. "అటువంటి విమానం బొమ్మ లేదమ్మా! అది చాలా ఖరీదు, పట్టణంలో దొరుకుతుంది" అన్నాడు రహీంతాత.

'కీ' ఇస్తే నడిచే విమానం బొమ్మ రహీం తాత వద్ద లేకపోవడంతో ప్రజ్ఞ నిరుత్సాహపడింది. అయినా అక్కడ ఉన్న కొయ్యబొమ్మలు ఆమెకు బాగా నచ్చాయి. "తాతా! వీటన్నిటిని ఎంతకు అమ్ముతావు?" అని అడిగింది. ఆమె ఆసక్తిని గమనించాడు రహీం తాత. "అమ్మో! వీటన్నింటిని కొనాలంటే ఐదారు వందల దాకా అవుతుంది. నీకు ఆడుకోడానికి బొమ్మలు కావాలి అంతే కదా! నీకు వీలున్నప్పుడల్లా వచ్చి వీటితో ఇక్కడే ఆడుకో" అని అన్నాడు. ఆ మాటలకు ప్రజ్ఞ చాలా సంబరపడింది.

రోజా సాయంత్రం వేళల్లో, సెలవు రోజుల్లో ప్రజ్ఞ రహీం తాత దుకాణానికి వెళ్లేది. అక్కడ బొమ్మలతో ఆడుకునేది. రహీం తాత బొమ్మలు తయారు చేస్తుంటే ఆసక్తిగా గమనించేది. ఒక రోజు "తాతా! నీలా నేను బొమ్మలు తయారు చెయ్యగలనా?" అని అడిగింది. "నేర్చుకుని బాగా అభ్యాసం చేస్తే నాకంటే అద్భుతంగా బొమ్మలు తయారు చేయగలవు. అభ్యాసం కూసు విద్య" అని రహీం తాత సమాధానం ఇచ్చాడు.

ప్రజ్ఞ దుకాణానికి రాని రోజు రహీం తాతకు ఎంతో వెలితిగా అనిపించేది. ప్రజ్ఞకూ అంతే! రహీం తాత అన్నా, అతడు తయారు చేసే కొయ్య బొమ్మలన్నా ఎంతో అభిమానం ఏర్పడింది. రహీం తాత కొయ్యబొమ్మలు తయారు చేసేటప్పుడు, కర్రను చెక్కేటప్పుడు ప్రజ్ఞకు రకరకాల కథలు, పాటలు చెప్పేవాడు. అప్పుడప్పుడు ఆమె కూడా బొమ్మలు చేయడంలో అతనికి సాయం చేసేది.

ఆ రోజు ఆదివారం. బడికి సెలవు. ఎప్పటిలాగానే ప్రజ్ఞ రహీం తాత దుకాణానికి వెళ్లింది. అతడు కర్రను బాడిసెతో చెక్కుతున్నాడు. "తాతా! వచ్చే ఆదివారం ఏప్రిల్ 23. ఆ రోజు నా పుట్టిన రోజు తెల్సా! నాకు మా నాన్న పట్టు లంగా, జాకెట్టు కుట్టిస్తున్నాడు" సంబరంగా చెప్పింది ప్రజ్ఞ. "ఓహో! అలాగా! ఈ బంగారు పాప ఏప్రిల్ 23న పుట్టిందన్నమాట" ప్రజ్ఞ తల నిమురుతూ అన్నాడు రహీం తాత. "తాతా! నిన్న మా బళ్లో శాంతి టీచర్ అక్బర్-బీర్బల్ కథ చెప్పింది. చాలా తమాషాగా ఉందా కథ" అంది ప్రజ్ఞ. "అలాగా అయితే ఆ కథ ఏమిటో చెప్పమ్మా! వింటాను" అన్నాడు రహీం తాత కర్రను చెక్కుతూనే. ప్రజ్ఞ కథ చెప్పసాగింది. ఊ.. కొడుతూ కథ వినసాగాడు రహీం తాత. కర్ర బాగా పెళుసుగా ఉందేమో చిన్న కర్రముక్క విసురుగా ఎగిరి అమాంతం రహీం తాత కంటికి బలంగా గుచ్చుకుంది. రక్తం కారసాగింది. ప్రజ్ఞ గాబరా పడింది. చుట్టుపక్కల వాళ్లను పిలిచింది. అందరూ కలిసి రహీం తాతను డాక్టరు వద్దకు తీసుకెళ్లారు. కంటికి తగిలిన గాయం తగ్గడానికి నాలుగు రోజులు పట్టింది. కర్రను చెక్కేటప్పుడు కళ్లకు రక్షణగా కళ్లజోడు పెట్టుకోవాలని డాక్టరు సూచించాడు. లేకపోతే కళ్లు పోయే ప్రమాదం ఉందని హెచ్చరించాడు. ప్రజ్ఞ డాక్టరు చేసిన సూచన వింది. రహీం తాతకు కళ్లజోడు కొనివ్వాలని నిశ్చయించుకుంది.





తను దాచుకున్న డబ్బును తీసుకుని డాక్టరు వద్దకు పరుగెత్తింది. అతడే కళ్లజోళ్లు కూడా అమ్ముతాడు. తను తెచ్చిన రూపాయలు ఇచ్చి రహీం తాతకు మంచి కళ్లజోడు ఒకటి ఇవ్వమంది. "కళ్లజోడు కొనడానికి నువ్వు తెచ్చిన డబ్బులు సరిపోవు, ఇంకా కావాలి!" అన్నాడు డాక్టరు. ప్రజ్ఞకు ఏం చేయాలో తోచలేదు. "కావాలంటే రహీం తాత నాకిచ్చిన రంగురంగుల కొయ్య బొమ్మలన్నీ తెచ్చిస్తాను, కళ్లజోడు ఇవ్వండి" అని బతిమాలింది. ప్రజ్ఞ మంచితనం, దయాగుణం, పెద్దల పట్ల ఉన్న గౌరవం, ప్రేమ చూసిన డాక్టరు ఆమెను అభినందించాడు. ఆమె ఇచ్చిన డబ్బుకే కళ్లజోడు ఇచ్చాడు.

ప్రజ్ఞ పుట్టిన రోజుకు ఆమె కోరుకున్న 'కీ' ఇస్తే తిరిగే విమానం బొమ్మ కొనివ్వాలని అనుకున్నాడు రహీం తాత. తన దగ్గరున్న డబ్బులన్నీ తీసి లెక్కపెట్టాడు. డాక్టరు తప్పనిసరిగా కళ్లజోడు వాడాలని చెప్పిన విషయం జ్ఞప్తికి వచ్చింది. కానీ, విమానం బొమ్మకు, కళ్లజోడుకు సరిపోయే డబ్బులు లేవు. ముందు ప్రజ్ఞ ముచ్చట తీర్చాలి తర్వాతే కళ్లజోడు అని నిర్ధారించుకున్నాడు.

ప్రజ్ఞ పుట్టిన రోజు రానే వచ్చింది. ప్రజ్ఞ పొద్దునే రహీం తాత ఇంటికి పరుగెత్తింది. "ప్రజ్ఞా! ఏదీ ఒకసారి కళ్లు మూసుకో" అన్నాడు రహీం తాత. ఆమె కళ్లు మూసుకుంది. తాత తను కొన్న విమానం బొమ్మకు 'కీ' ఇచ్చి నేల మీద పెట్టాడు. ప్రజ్ఞను కళ్లు తెరవమన్నాడు. శబ్దం చేస్తూ తిరుగుతున్న విమానం బొమ్మను చూసి కేరింతలు కొట్టింది ప్రజ్ఞ. "రహీం తాతా! ఇప్పుడు నువ్వు కళ్లు మూసుకోవాలి" అంది ప్రజ్ఞ. ఆశ్చర్యంగా చూసి కళ్లు మూసుకున్నాడు రహీం తాత. అతడి కళ్లకు కళ్లజోడు పెట్టింది ప్రజ్ఞ. కళ్లు తెరిచి చూశాడు రహీం తాత. ప్రజ్ఞ తన పట్ల చూపిన అభిమానానికి అతడి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ప్రజ్ఞ కోసం వెదుకుతూ వచ్చిన వాళ్ల నాన్న ఇది చూశాడు. తన కూతురును చూసి గర్వపడ్డాడు. రహీం తాత ప్రజ్ఞను పొగుడుతూ ఉంటే పొంగిపోయాడు.



## ఇవి చేయండి.



అ. రహీం తాత గురించి ఒక్కొక్కరు ఒక వాక్యం చెప్పండి.

ఆ. 1. పాఠంలో ఐదు అక్షరాల పదాలు ఎన్ని ఉన్నాయి? వాటిని రాయండి.

2. కింది విషయాన్ని చదివి జవాబులు రాయండి.

ప్రశ్న : రహీం తాతా! ఇవ్వాళ మా శాంతి టీచరు ఒక కథ చెప్పింది తెలుసా?

రహీం : అలాగా! ఏమిటా కథ?



ప్రశ్న : రాజుగారి కోటకు రాత్రిపూట కోటయ్య కాపలాదారు. ఒకరోజు ఉదయమే అతడు పరుగెత్తుకుంటూ వచ్చి రాజుతో "రాజా! నిన్న రాత్రి నాకొక కల వచ్చింది. అందులో మీరు వేటకు అడవికి వెళ్లారట. అక్కడ దోపిడీదొంగలు మిమ్మల్ని చితక బాదారట. ఉన్న నగలు, డబ్బు దోచుకున్నారట. నాకు వచ్చిన కలలన్నీ నిజమయ్యాయి. కాబట్టి దయచేసి మీరు అడవికి వెళ్లకండి" అని అన్నాడు. అప్పుడు రాజా కోటయ్యను మెచ్చుకుని తగిన బహుమానం ఇచ్చాడు. కానీ వెంటనే అతడిని ఉద్యోగంలోంచి తొలగించాడు.

1. రహీం తాతకు కథ చెప్పింది ఎవరు?

క. శాంతి టీచర్ చ. ప్రశ్న ట. కోటయ్య త. ఎవరూ కాదు.

2. కోటయ్య చేయవలసిన పని?

క. దొంగలు పడకుండా చూడడం చ. రాజును కాపాడడం

ట. కోటను ఎప్పుడూ కాపలా కాయడం త. రాత్రిపూట కోటను కాపలా కాయడం

3. కోటయ్యకు రాజా ఎందుకు బహుమానం ఇచ్చాడు?

క. జరగబోయే దానిని ముందే చెప్పగలిగినందుకు

చ. దోపిడీ దొంగల బారిన పడకుండా కోటయ్య చెప్పినందుకు

ట. కోటయ్య కలలు నిజమౌతున్నందుకు

త. పైవేవీ కావు

# 7. తెలివి తక్కువ సీతయ్య

గుంజపడుగ అనే గ్రామంలో సీతయ్య ఉండేవాడు. సీతయ్య చాలా అమాయకుడు. ఒకసారి తన బంధువుల ఇంటికి పొరుగు ఊరు సిరిపురం వెళ్లవలసి వచ్చింది. ఆ ఊరికి ఎలా వెళ్లాలి? అని తన భార్యను అడిగాడు. ఆమె "ముక్కు సూటిగా వెళ్లండి" అంది. "ఓహో! ముక్కుసూటిగా వెళ్లాలి అంతేకదా!" అనుకుంటూ బయలుదేరాడు. ముక్కుసూటిగా పోతుండగా, ఒక మర్రి చెట్టు అడ్డం వచ్చింది.

సీతయ్య చెట్టు ఎక్కాడు! కాని దిగడం ఎలాగో తెలియలేదు. ఎవరైనా వచ్చి సాయం చెయ్యక పోతారా అని చూడసాగాడు. దూరం నుండి ఒక ఎడ్ల బండి వస్తుండడం గమనించాడు. ఆ బండి రామయ్యది. బండిలో ఉన్న అతడిని సీతయ్య గుర్తుపట్టి బిగ్గరగా పిలిచాడు. ఆ కేకలకు రామయ్య బండి ఆపి, "సీతయ్యా! ఏమైంది! ఆ చెట్టు ఎందుకు ఎక్కావు?" అని అడిగాడు. మర్రిచెట్టు తన మార్గంలో ఎలా అడ్డం వచ్చిందో చెప్పి, దాటి వెళ్లేందుకు చెట్టు ఎక్కానని సీతయ్య తెలిపాడు. "మరి నీకు చెట్టు దిగడం రాదా?" అని రామయ్య అడిగితే, "లేదు, అందుకే ఇక్కడే ఉండి ఎవరైనా వస్తారేమో! అని చూస్తున్నాను" అని చెప్పాడు సీతయ్య. "నువ్వేమీ గాబరాపడకు, మెల్లగా ఊడలు పట్టుకొని జారు, నేను బండిపై నుండి నిన్ను అందుకుని దింపుతాను" అన్నాడు.

రామయ్య బండి పైన నిలబడి సీతయ్యను మెల్లగా దింపుతుండగా, సీతయ్య "ఏయ్యేయ్య్, మెల్లగా మెల్లగా" అనడం మొదలు పెట్టాడు. దానితో ఎడ్లు ముందుకు కదిలాయి. ఇద్దరు ధామ్మని కిందపడ్డారు.



రామయ్య, సీతయ్య ఒకరి మీద ఒకరు పడ్డారు. రామయ్య కాలు బెణికింది. సీతయ్యకు ఏ... గాయాలు ఏమీ కాలేదు. "అయ్యో! రామయ్యా! గాయం బాగా తగిలిందా?" అని అడిగాడు. సీత... పుణ్యానికి పోతే పాపం ఎదురైనట్లు, నీకు సహాయం చేద్దామంటే నాకు గాయమైంది. సరే! అంతా నా ప్రా... అన్నాడు. దెబ్బ తగిలిన స్థలంలో నూనె రాస్తే తగ్గుతుంది అంటూ సీతయ్యకు డబ్బులిచ్చి, దుకాణానికి వెళ్ళి... తీసుకొని రమ్మన్నాడు. సరే అని సీతయ్య దుకాణానికి వెళ్లాడు.

షావుకారు నూనె గిన్నెలో పోసి ఇచ్చాడు. తననందరూ తెలివితక్కువ వాడంటారని సీతయ్య జ్ఞాపకం తెచ్చుకొని, ఆ షావుకారిని "నూనె ఇంతేనా? కొసరు ఏమీ పోయవా?" అని అడిగాడు. అపుడు షావుకారు "గిన్నె నిండుగా నూనె ఉంది. కొసరు పోసేందుకు ఖాళీ లేదు కదా!" అన్నాడు. కొసరు పోయడం తప్పించుకోవాలనుకుంటున్నాడని అనుకొని "చూడు ఈ గిన్నె అడుగు భాగం లొట్టగా ఉంది. ఇక్కడ పోయి" అని గిన్నెను వంచాడు. అంతే! ఆ గిన్నెలోని నూనె నేలపాలైంది.



అతని తెలివితక్కువతనానికి షావుకారు నవ్వుకున్నాడు. "ఏమిటి నవ్వుతున్నావు? నవ్వితే కొసరు అడగననుకుంటున్నావా? పోసి తీరాల్సిందే" అన్నాడు. షావుకారు ఆ గిన్నె అడుగుభాగం లొట్టలో నూనె పోశాడు.

సీతయ్య దానిని చాలా జాగ్రత్తగా పట్టుకొని రామయ్య దగ్గరికి వచ్చాడు. "సీతయ్యా ఏమిటి గిన్నెను బోర్లించి పట్టుకొస్తున్నావు? నూనె తేలేదా?" అని అడిగాడు. "తేకేం? ఇదిగో చూడు. ఇది కొసరు మాత్రమే! అసలు నూనె గిన్నెలో ఉంది" అని గిన్నెలో నూనె చూపబోయాడు. అంతే!

రామయ్య సీతయ్య తెలివితక్కువతనానికి జాలిపడి "సీతయ్యా! ఎలా బతుకుతున్నావయ్యా! పది మందిని చూసి తెల్సుకోవాలి" అన్నాడు. సీతయ్య కూడా చాలా బాధపడి "నేను నా తెలివిని పెంచుకొంటాను. అసలు తెలివి అంటే ఏమిటి" అని అడిగాడు. సీతయ్యకు ఎంత చెప్పినా లాభం లేదనుకొని, సమయస్ఫూర్తి కలిగి ఉండాలని చెప్పాడు.

రామయ్య కుంటుకుంటూ మెల్లగా వెళ్లిపోయాడు. సీతయ్య సమయస్ఫూర్తి గురించి ఆలోచిస్తూ ప్రయాణం కొనసాగించాడు. కొంతదూరం పోయేసరికి ఒక ఇస్త్రీ దుకాణం కన్పించింది. ఇస్త్రీ షాపు యజమాని సమ్మయ్యను "సమయస్ఫూర్తి అంటే ఏమిటి?" అని అడిగాడు. సమ్మయ్య సీతయ్యకు ఎలా చెప్పాలా అని ఆలోచించాడు. "చూడు నేను ఈ టేబుల్‌పై చేయి ఉంచాను.



నీవు గట్టిగా నా చేతిపై ఒక గుద్దు గుద్దు" అన్నాడు. 'ఇదేమిటి సమయస్ఫూర్తి గురించి అడిగితే చేతిపై కొట్టమంటున్నాడు. ఒకవేళ ఇతను చెప్పినట్లు చేయకుంటే సమయస్ఫూర్తి గురించి చెప్పడేమో!' అనుకుని సీతయ్య ఒక్క గుద్దు గుద్దాడు. అపుడే సమ్మయ్య చటుక్కున తన చేతిని తీసేశాడు. అంతే! సీతయ్య చెయ్యి ఆ టేబుల్‌ను బలంగా తాకింది. "అబ్బా! ఇదేమిటయ్యా! నేను సమయస్ఫూర్తి గురించి అడిగితే ఇలా చేశావు" అన్నాడు సీతయ్య. "సమయస్ఫూర్తి అంటే నీకు అర్థం కావాలని ఇలా చేశాను. నీవు గుద్దేటపుడు నేను ఒకవేళ చేతిని అక్కడే ఉంచితే ఏమై ఉండేది? నాకు దెబ్బ తగిలి ఉండేది. అందుకే నా చేతిని వెనక్కి తీసుకున్నాను. ఇదే సమయస్ఫూర్తి అంటే" సమ్మయ్య వివరించాడు.

"ఓహో! సమయస్ఫూర్తి అంటే ఇంతేనా? అర్థం అయింది" అని తల ఊపి సీతయ్య ప్రయాణం కొనసాగించాడు. సాయంత్రానికి బంధువుల ఇంటికి చేరుకొన్నాడు. తను కూడా తెలివి గలవాడని నిరూపించుకోవాలి, తన సమయస్ఫూర్తిని ప్రదర్శించాలి అని తహతహలాడాడు. అక్కడే ఉన్న తన బావమరిదిని పిలిచాడు. అతను "ఏం బావా? ఏమిటి?" అంటూ వచ్చాడు. "నీకు సమయస్ఫూర్తి అంటే ఏమిటో చూపిస్తా చూడూ" అంటూ టేబుల్ కోసం వెతికాడు. కానీ అక్కడ టేబుల్ కనిపించలేదు. "నేను నా చేతిని ముఖంపై ఉంచుకొంటాను. నీవు బలంగా నా చేతి మీద గుద్దు" అన్నాడు. తన బావ సంగతి అతనికి బాగా తెలుసు. అతను చెప్పినట్లు చేయకపోతే ఏమనుకుంటాడోనని ఒక్క గుద్దు గుద్దాడు. సీతయ్య తన సమయస్ఫూర్తిని ప్రదర్శించడానికి తన చేతిని ముఖంపై నుండి తీశాడు. అంతే !

## ఇవి చేయండి.

అ. ఈ పాఠంలోని ఒక సన్నివేశాన్ని మూకాభినయం చేయండి. ఏమి అభినయం చేశారో మిగిలినవారిని చెప్పమనండి.

ఆ. 1. ఇది ఐదక్షరాల పదం. పాఠంలో మూడు పేరాల్లో ఉంది. ఈ పదమేదో చెప్పండి. ఇది ఉన్న వాక్యాలు రాయండి.

2. కింది పేరాను చదివి జవాబులు రాయండి.



ఒకరోజు రాజు తన మంత్రితో ముగ్గురు మూర్ఖులను వెదికి తీసుకు రమ్మన్నాడు. రాజు గారి మాటకు ఎదురు చెప్పలేక మంత్రి మూర్ఖుల వేటకు వెళ్లాడు. దారిలో గడ్డిమోపు నెత్తిపై పెట్టుకొని గుర్రం మీద పోతున్న వ్యక్తి కనిపించాడు. మంత్రి అతడిని గడ్డిమోపు నెత్తిమీద పెట్టుకుని ఎందుకు పోతున్నావని అడిగాడు. "గుర్రం ముసలిదైంది. నా బరువు మోయడమే దానికి కష్టం. అందుకే గడ్డిమోపును నేను మోస్తున్నాను" అని చెప్పాడు. మంత్రి అతడిని తీసుకొని రాజు దగ్గరికి వెళ్లాడు. అతని గురించి రాజుకు చెప్పాడు. రాజు పొట్టచెక్కలయ్యేలా నవ్వాడు. తర్వాత మిగిలిన ఇద్దరు ఏరి అని అడగగా మంత్రి మనమేనని రాజుతో అన్నాడు.

1. గుర్రం మీదున్న వ్యక్తిని మంత్రి ఎందుకు ఆపాడు?
2. అతని గురించి మంత్రి రాజుతో ఏమని చెప్పాడు?
3. రాజు ఎలా నవ్వాడు? ఎందుకు?
4. పై కథలో ముగ్గురు మూర్ఖులు ఎవరు?

వెంకటయ్య ఆ రోజు దిన పత్రికను తిరగేస్తున్నాడు. మనవరాలు అనూరాధ కూడా పత్రికలోని ఇంకో పేజీ తీసుకుంది. తానూ చదవడం మొదలు పెట్టింది. అంతలోనే "రుణాలు ఇస్తారని ఊళ్లో అందరూ అనుకుంటున్నారు. నిజమేనా!" అంటూ రాములమ్మ వచ్చింది. వెంకటయ్య "అవును, ఈ రోజు పేపర్లో కూడా వచ్చింది" అని చెప్పి, ఆ వార్తను అనూరాధతో చదివించాడు.



## స్వయం ఉపాధి కోసం మహిళలకు రుణాలు



........., నవంబరు 27 :

మహిళల అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నట్లు ......... మండల పరిషత్ అభివృద్ధి అధికారి శ్రీమతి టి. శ్రీలక్ష్మి చెప్పారు. మండల కేంద్రంలో నేడు జరిగిన మహిళల ప్రత్యేక సమావేశంలో ఆమె ప్రసంగించారు. మండల అధికారులు సమావేశంలో పాల్గొన్నారు. గాంధీజీ కుటీర పరిశ్రమలకు ఇచ్చిన ప్రాముఖ్యాన్ని శ్రీమతి శ్రీలక్ష్మి ఈ సందర్భంగా ప్రస్తావించారు. ప్రస్తుతం మహిళల అభివృద్ధి కోసం ప్రవేశపెట్టిన వివిధ పథకాలను వివరించారు. స్వయం ఉపాధి కోసం మహిళలు చేపడుతున్న వివిధ కార్యక్రమాల్లో శిక్షణ ఇస్తున్నారని తెలిపారు. ఈ శిక్షణ పాడి పరిశ్రమ, కొవ్వొత్తులు, విస్తళ్లు, ఫినాయిల్, సబ్బులు, బ్రెడ్ తయారీ, టీ.వీ., రేడియోల మరమ్మత్తు మొదలగు వాటిల్లో ఉంటుందని తెలిపారు. వీటిని కుటీర పరిశ్రమలుగా రూపొందించడానికి సబ్సిడీపై మహిళా సంఘాలకు కూడా రుణాలు సమకూరుస్తున్నట్లు చెప్పారు.

అనూరాధ చదివిన వార్తను రాములమ్మ విన్నది. ఆమెకు చాలా ఆనందం వేసింది. తాను పాడి పరిశ్రమ పెట్టుకోవాలనుకుంది. రుణం కోసం దరఖాస్తు ఎలా పెట్టుకోవాలని వెంకటయ్యను అడిగింది.

28-11-99

మండల పరిషత్ అభివృద్ధి అధికారి,
మండల పరిషత్ కార్యాలయం,
. . . . . . . . . . . . . (మండలం),
. . . . . . . . . . . . .  (జిల్లా).

అయ్యా !

విషయం : పాడి పరిశ్రమ నిమిత్తం రుణం మంజూరు కోసం దరఖాస్తు

కొనగాల లింగయ్య భార్యనైన రాములమ్మ అను నేను సదరు మండల పరిధిలో గల . . . . . గ్రామంలో నివసిస్తున్నాను. నా భర్త వ్యవసాయ కూలీగా పని చేస్తున్నాడు. నేను కూడా కొద్దో, గొప్పో పని చేసి నా కుటుంబానికి సాయపడాలని అనుకొంటున్నాను. అందుకుగాను పాడి పరిశ్రమ పెట్టడానికి రుణం మంజూరు చేయవలసినదిగా కోరుతున్నాను. అట్టి రుణాన్ని వాయిదాల పద్ధతిపై తీర్చగలను.

తమకు నా కృతజ్ఞతలు.

తమ విధేయురాలు
కొనగాల రాములమ్మ
కొనగాల లింగయ్య భార్య
. . . . . . . . . . . (గ్రామం)
. . . . . . . . . . . (మండలం)

రాములమ్మ దరఖాస్తును మండల పరిషత్ అభివృద్ధి అధికారికి అందజేసింది.





Scanned by CamScanner

ఆయన దరఖాస్తు పరిశీలించాడు. మీరు పదిమంది కలిసి మహిళా సంఘంగా ఏర్పడి వస్తే రు సహాయం కల్పిస్తామని చెప్పాడు. ఆయన సూచన మేరకు రాములమ్మ మహిళా సంఘాన్ని ఏర్పరచిం మండల పరిషత్ అభివృద్ధి అధికారిగారికి సంఘ వివరాలు తెల్పింది. ఆయన వివరాలు పరిశీలించా అర్హులుగా భావించి వారికి రుణం మంజూరు చేశాడు. రుణం పొందిన మహిళా సంఘ సభ్యులు స పరిశ్రమ పెట్టుకున్నారు. దానితో వారి ఆర్థిక పరిస్థితి మెరుగుపడింది. రుణాన్ని వాయిదాల్లో చెల్లిస్తున్నారు ఇప్పుడు రాములమ్మ తన కూతుళ్లను పై చదువులకు పట్నం పంపి చదివిస్తున్నది.

## ఇవి చేయండి.

అ. మహిళా సంఘాలకు, రుణాలకు సంబంధించిన వార్తలను కొన్ని సేకరించండి. చదివి వినిపించండి.

ఆ. కింది వార్తను చదవండి. ఇచ్చిన ప్రశ్నలకు జవాబులు చెప్పండి, రాయండి.

### ఎస్.జి.ఎస్.వై. పథకం కింద మహిళలకు రుణాలు

అనంతపురం, ఆగస్టు 5 (న్యూస్‌టుడే) : ఎస్.జి.ఎస్.వై. పథకం కింద దరఖాస్తు చేసుకున్న మహిళలకు అర్హతను బట్టి రుణాలు మంజూరు చేస్తామని తెలుగు బాల మహిళా ప్రాంగణం చైర్మన్, డి.ఆర్.డి.ఎ. ప్రాజెక్టు డైరెక్టర్ ఎ.కె. మిశ్రా పేర్కొన్నారు. ప్రోత్సాహిక మహిళా పారిశ్రామిక వేత్తల శిక్షణ శిబిరం ముగింపు సందర్భంగా స్థానిక తెలుగు బాల మహిళా ప్రాంగణంలో గురువారం ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. మార్కెటింగ్, డిమాండ్, ప్రాడక్ట్ ....కు సంబంధించి వివిధ పథకాలపై అవగాహన కల్పించడానికి వారం పాటు 40 మందికి శిక్షణ తరగతులు నిర్వహించారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన మాట్లాడుతూ మహిళల కోసం ప్రభుత్వం కల్పిస్తున్న పథకాలను సద్వినియోగం చేసుకోవాలని విజ్ఞప్తి చేశారు. ఈ సమావేశంలో జిల్లా పరిశ్రమల శాఖ మేనేజర్ కె. లక్ష్మణరావు, లీడ్ బ్యాంక్ డిస్ట్రిక్ట్ మేనేజర్ ఎ. నరసింహయ్య, ప్రాంగణం అధికారి కె. రమాప్రభ తదితరులు ప్రసంగించారు.

1. ఈ వార్తను ఏ తేదీన రాశారు?
2. ఈ వార్త ఏ సందర్భంగా ప్రచురితమయింది?
3. ఈ సమావేశంలో ముఖ్య అతిథిగా పాల్గొన్నది ఎవరు? వారు ఏమని పేర్కొన్నారు?
4. శిక్షణ తరగతులు ఎందుకు నిర్వహించారు?
5. ఏమి సద్వినియోగం చేసుకోవాలని సమావేశంలో చెప్పారు?
6. ఈ సమావేశంలో ఇంకా ఎవరెవరు పాల్గొన్నారు?
7. ఎస్.జి.ఎస్.వై., డి.ఆర్.డి.ఎ. మార్కెటింగ్, డిమాండ్, ప్రాడక్ట్, లీడ్ బ్యాంక్ మొదలైన వాటి గురించి తెలుసుకోండి.

ఇ. కింద 'దివ పత్రిక' అన్న పదం ఉంది. ఈ పదంలోని అక్షరాలు ఏ స్థానంలో ఉన్నాయో అదే స్థానంలో ఆ అక్షరాలను వచ్చేటట్లుగా మరికొన్ని పదాలు రాయండి.

దివపత్రిక

ది - [ది] విటి, ______________________________

వ - వా [వ] రం ______________________________

# 9. ఆకాంక్ష

చిన్నారి బాలలూ! ఎన్నాళ్ళ నుండో నాకు మీతో కొన్ని మంచి విషయాలను ముచ్చటించాలని ఉంది. వింటారా మరి!

మీరు నన్ను గురించి ఇంతకు ముందే తెలిసికొని ఉంటారు. నేను బంతిలా గుండ్రంగా ఉంటాను. నా చుట్టూ నేను



తిరుగుతుంటాను. సూర్యుడి చుట్టూ ప్రదక్షిణం చేస్తూ ఉంటాను. ఇలా పరిభ్రమించడం వల్ల ఏం జరుగుతుందో మీకు తెలుసు కదూ! నాపైన ఎప్పుడూ సగభాగం వెలుతురు; సగభాగం చీకటి ఉంటుంది.

నేనెవరిని?

అబ్బో! నేను ఇప్పటిదాన్నా? నాది చాలా పెద్ద వయస్సు. నేను పుట్టి ఇప్పటికి 450 కోట్ల సంవత్సరాలయిందని శాస్త్రజ్ఞుల అంచనా. నాపైన పెద్దపెద్ద పర్వతశ్రేణులు, ఉప్పొంగే జలరాశులు, ఉన్నతమైన గిరులు, మహారణ్యాలు, జీవనదులూ ఉన్నాయి. నా గర్భం ప్రశస్తమైన ఖనిజాలకు పుట్టినిల్లు. నా ఒడిలో మీతోపాటు కోట్లకొలది జీవులు సంచరిస్తున్నాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే నేను మీకు సకల సంపదలనిచ్చే కల్పవల్లిని! నన్ను మీరు భూమాత అంటూ గౌరవిస్తారు. అరరే! నా పేరు చెప్పేశానే? చెప్తే మాత్రం ఏం పోయిందిలే. మీరు తెలివైన పిల్లలు కదూ! నేను చెప్పకముందే నేనెవరో గ్రహించే ఉంటారు.

ఏదో కథ చెబుతుందనుకుంటే - ఇదేమిటి? అనుకుంటున్నారు కదూ! నా బాధను మీతో కాక మరెవరితో చెప్పుకోను? నా గుండెల్లో ఎంత ఆవేదన ఉందో!

అభివృద్ధి, అభివృద్ధి అంటూ మనుషులు నా శరీరం మీద ఎన్ని గాయాలు చేస్తున్నారో చూడండి. నన్ను మరీ గాయపరచకుండా మనిషి అభివృద్ధి సాధించలేడా ఏమిటి? నాకు ఆభరణాల్లా ఉన్న సుందర వనాలను నరికివేస్తున్నారు. నదీ జలాలను కలుషితం చేస్తున్నారు. నా గర్భాన్ని చీల్చి విలువైన ఖనిజ సంపదను విచక్షణ లేకుండా స్వార్థంతో కొల్లగొడుతున్నారు.

నా ఒడిలో మీరంతా నాలుగు కాలాలపాటు కళకళలాడుతూ తిరగాలి. మీరేకాదు. రంగురంగుల పక్షులూ, వన్యమృగాలూ, జలచరాలూ ఇవన్నీ బతకాలి. విశ్వంలోని గ్రహాలన్నింటిలోనూ నాకో ప్రతే[illegible]ంది. అదేమిటో తెలుసా? నాపైన [illegible] వాతావర[illegible] ఉంది. సమస్త ప్రాణులు చక్కగా జీవించ[illegible]వసరమైన ప్రాణవాయువు ఉంది. అలాంటి వాతావరణాన్ని కాపాడుకోవాలి గదా!

# 10. చెట్టు సాక్ష్యం

అవంతీపురంలో ధనగుప్తుడు, నందిగుప్తుడనే వర్తకులు ఉండేవారు. వాళ్లు పొరుగుదేశాలకు వెళ్లి వ్యాపారం చేశారు. వారి వ్యాపారం 'మూడు పువ్వులు ఆరుకాయలు'గా అభివృద్ధి చెందింది. బాగా డబ్బు సంపాదించారు. తమ నగరానికి తిరిగి వచ్చారు. వ్యాపారం వారికి 'వెన్నతో పెట్టిన విద్య'. ఇద్దరూ మరో వ్యాపారం చేయాలనుకున్నారు. అంతవరకు సొమ్ము దాచాలి. 'ధనాన్ని దాపరికం - సేద్యానికి వెల్లడి' అన్నారు కదా ! సొమ్ము ఎక్కడ దాచాలని ఆలోచించారు. చివరకు ఊరి బయట చెట్టు కింద దాచాలనుకున్నారు. ఇద్దరూ కలిసి వెళ్లారు. చెట్టు కింద గొయ్యి తవ్వారు. డబ్బు దాచారు.



'డబ్బుకు లోకం దాసోహం' అని ధనగుప్తుడి నమ్మకం. అతనికి దురాశ పుట్టింది. మొత్తం సొమ్ము తానే కాజేయాలనుకున్నాడు. ఒకనాటి రాత్రి చెట్టు దగ్గరికి వెళ్లి ధనమంతా తెచ్చుకున్నాడు. ఇంట్లో దాచాడు. 'ఉలుకు పలుకు' లేకుండా ఊరుకున్నాడు.

కొద్ది రోజుల తరువాత స్నేహితులిద్దరు డబ్బు తెచ్చుకోవాలనుకున్నారు. కలిసి చెట్టు దగ్గరికి వెళ్లారు. ధనగుప్తుడు మాత్రం 'తేలు కుట్టిన దొంగ'లా చూస్తూ నిలుచున్నాడు. నందిగుప్తుడే గోతిని

తన్నాడు. అందులో సొమ్ము లేదు. ఆశ్చర్యపోయాడు. స్నేహితుడి వైపు తిరిగాడు. అన్నీ తెలిసిన ధనగుప్తుడు 'కోపం నటించాడు'. 'పోరుంటే పోరు గెలుస్తుందని' నందిగుప్తుడిపై 'విరుచుకపడ్డాడు'. నీవే ద్రోహబుద్ధితో మొత్తం సొమ్ము కాజేశావు. ఇప్పుడు 'నక్క వినయాలు నటిస్తున్నావు' అన్నాడు. ధనగుప్తుడి మాటలకు నందిగుప్తుడికి కూడా కోపం వచ్చింది. 'ధర్మానికి పోతే కర్మం చుట్టుకున్నది' అన్నట్లుంది వరుస. నన్నే దొంగ అంటావా! ఇలా ఇద్దరు పోట్లాడుకున్నారు. తగువు తెగలేదు. తీర్పు కోసం రాజు వద్దకు వెళ్లారు.

ధనగుప్తుడు, నందిగుప్తుడు ఇద్దరు విషయాన్ని రాజుకు వివరించారు. నందిగుప్తుడే ధనం దొంగిలించాడనటానికి ఆధారమేమిటని అన్నాడు రాజు. 'దొంగకు ధైర్యమెక్కువ' అన్నట్లు ధనగుప్తుడు 'జంకుగొంకు' లేక నిలబడ్డాడు. ఇందుకు చెట్టే సాక్ష్యం చెప్తుంది, కావాలంటే పరీక్షించుకోండి, 'నిజం నిలకడ మీద తెలుస్తుంది' అన్నాడు. మరునాటి ఉదయం చెట్టు దగ్గరికే వెళ్లి పరీక్షించాలని నిర్ణయించుకున్నారు.



ధనగుప్తుడు ఇంటికి వచ్చాడు. జరిగిందంతా తన తండ్రికి చెప్పాడు. "చెట్టుకు తొర్ర ఉంది. అందులో దాక్కొని, రాజు అడిగినప్పుడు సాక్ష్యం చెప్పు"మని తండ్రిని కోరాడు. 'నమ్మిన మిత్రునికి ద్రోహం చేయరాదు' అని తండ్రి ధనగుప్తుడికి బుద్ధి చెప్పాడు, కానీ ధనగుప్తుడు తండ్రి మాటలను 'పెడచెవిని పెట్టాడు'. 'పోగాలం దాపురించినవారికి పెద్దల మాటలు చెవికెక్కవు కదా!'. తండ్రి ఏమీ చేయలేకపోయాడు. దైవం మీద భారం వేసి ఉదయమే వెళ్లి చెట్టు తొర్రలో దాక్కున్నాడు.

మరునాడు రాజు పరివారంతో చెట్టు దగ్గరికి వెళ్లాడు. రాజు చెట్టును చూసి, "ఓ వృక్ష రాజమా! వీళ్లిద్దరు నీ వద్ద దాచిన సొమ్ము ఏమైంది? చెప్పు" అని అడిగాడు. అప్పుడు చెట్టు తొర్ర నుండి "మహారాజా! నందిగుప్తుడే ఆ సొమ్ము కాజేసి తీసుకెళ్లాడు. ధనగుప్తుడు ఏ పాపం ఎరుగడు" అనే మాటలు వినిపించాయి. రాజు ఆశ్చర్యపోయాడు. కొంతసేపు ఆలోచించాడు.



భటులను పిలిచి చెట్టు తొర్రలో గడ్డివేసి

పొగ పెట్టమన్నాడు. ఆ పొగకు ఊపిరి సలుపక ధనగుప్తుడి తండ్రి వెలుపలికి వచ్చాడు. జరిగిందంతా 'పూస గుచ్చినట్లు' చెప్పాడు. 'కడుపు తీపి'తో 'బుద్ధి గడ్డి తిని' నా కుమారుని మాట విన్నాను. నన్ను క్షమించండి అని కోరాడు. రాజు ధనగుప్తుడికి శిక్ష విధించాడు. నందిగుప్తుడికి రావలసిన సొమ్మును ఇప్పించాడు. ధనగుప్తుడి తండ్రిని మన్నించి వదలివేశాడు.

## ఇవి చేయండి.

అ. చెప్పండి.

- వలయాకారంలో కూర్చోండి.

- ఒక్కొక్కరు ఒక జాతీయంగాని, సామెతగాని చెప్పండి.

# 11. నక్క - మేక



కపటి నక్కయొకటి కర్మవశంబున
పడియె కాలుజారి బావిలోన
పైకి రాకనటనె పడియుండె నూతిలో
ఇంతలోన మేక యేగె నటకు.

దప్పిక గొని నూతి దాపు జేరెను మేక
నీటిలోకి చూచె నీరు ద్రావ
అంత మేక కనియె నట నక్క పడియుండ
దాని జూచి యధిక తాపమొందె.

నీటిలోని నక్క నీరసించె నతిగ
జంబుకమును జూచి జాలిపడియె
"ఏమి చేయుచుంటి విచట నొంటరిగను"
మేక యడిగె దాని మేలు గోరి.

అపుడు నక్క మిగుల నలసియుండియు దాని
మోసగింపననియె ముదము గూర్ప
మంచినీరు గలదు మనకు ద్రావ నిచట
నీవు వేగ దిగుము నీరు ద్రావ.



నక్క వాక్యములను నమ్మి మేషమురికె
నూతిలోనికపుడు నుడువమాట
రాక నిలిచియుండె రయము నక్క విగసి
నేర్పుతోడ నెక్కె నిచ్చెనట్లు.

విశ్రమించి నక్క విడిచి మేకనచట
పైకి చేరి తుదకు పారిపోయె
దిగులు చెంది చచ్చె దిక్కులేక యజము
కపట నరుని నీవు కనకుమెపుడు.

- వడ్డెపాటి రాధాకృష్ణమూర్తి



**భావం :**

జిత్తులమారి నక్క ఒకసారి కాలుజారి నూతిలో పడింది. ఒక మేక ఆ ప్రాంతానికి వచ్చింది. దప్పికతో నూతి దగ్గరకు వెళ్లింది. నీరు తాగటానికి నూతిలోకి చూసింది. నూతిలో పడి ఉన్న నక్క కనిపించింది. దాన్ని చూసి మేక బాధ పడింది. జాలి పడింది. దాని మేలు కోరి "ఒంటరిగా ఏం చేస్తున్నావు" అని అడిగింది.

నక్క మేకను మోసగించాలనుకున్నది. "ఇక్కడ తాగడానికి మంచినీరు ఉంది. వెంటనే దిగిరా!" అంది. నక్క మాటలను నమ్మి మేక నూతిలోకి దూకింది.

వెంటనే నక్క నిచ్చెన ఎక్కినట్లు నేర్పుతో మేకమీదికి ఎక్కి పైకి చేరింది. పారిపోయింది. దిక్కులేని మేక నూతిలోనే ఉండిపోయింది.

మోసగాళ్లకు దూరంగా ఉండాలి.

## ఇవి చేయండి.

**అ. బంతి ఆట**

వలయాకారంలో కూర్చోవాలి. ఒకరు కాగితం బంతిని ఎవరివైపైనా విసరాలి. ఇది ఎవరి వద్ద పడితే వారు నక్క-మేక కథకు చెందిన ఒక వాక్యం చెప్పాలి. మరల బంతి మరొకరివైపు విసరాలి. ఇలా కథ అయిపోయే వరకు ఆడాలి.

**ఆ. ఈ కింది పదాల్లో ఒక అక్షరం తీసేస్తే పద్యాల్లోని పదాలు కనిపిస్తాయి. వెతికి ఆ పద్య పాదాలు రాయండి.**

ఉదా॥ అముదము-ముదము — 'మోసగింపననియె ముదము గూర్చ'

వానరుని, మేనక, తేనీరు, మోకాలు, కచేరి, మేకలు, దాదాపు, దానిమ్మ, తుమ్మెదకు

**ఇ. ఒకే అర్థాన్ని ఇచ్చే పదాలు ఈ పాఠంలో ఉన్నాయి. వాటిని రాయండి.**

ఉదా॥ నక్క - జంబుకం

కనియె ________

మేక ________

అధికము ________

కపటము ________

వేగము ________

**ఈ. పాఠంలో మీకు తెలియని పదాలకు అర్థాలను పుస్తకం చివరగల అకారాది పట్టిక నుండి తెలుసుకొని రాయండి.**



ఒ.  కింది విషయాన్ని చదివి సరైన సమాధానాలు గుర్తించండి.

ఒక టక్కరి కొంగ దొంగ జపం చేస్తూ చెరువులోని చేపలను నమ్మించసాగింది. చేపలు దానిని చూసి మంచిదని నమ్మాయి. ఒకరోజు కొంగ చేపలను పట్టడానికి జాలర్లు వస్తారని, అందువల్ల వాటిని వేరొక కొలనులోనికి చేరుస్తానని చెప్పింది. సరే అన్నాయి చేపలు. కొంగ రోజూ ఒక్కొక్క చేపను పట్టుకెళ్లి తినసాగింది. అలాగే ఒకరోజు ఎండ్రకాయను తీసుకెళ్లేటప్పుడు అది కొంగ మోసాన్ని గ్రహించింది. తన కత్తెర కాళ్లతో దాని మెడను కత్తిరించింది.

1. టక్కరి నక్క అంటే . . . . . . . . .

   (ఎ) జిత్తులమారి  (బి) తెలివైన  (సి) ఎత్తులు వేసేది

2. కొంగ నిజంగా జపం . . . . . . . . .

   (ఎ) చేసింది  (బి) చేయలేదు  (సి) అప్పుడప్పుడు చేసింది

3. జాలర్లు చెరువులో చేపలు పట్టడానికి . . . . . . . . .

   (ఎ) వస్తారు  (బి) రారు  (సి) వచ్చి వెళ్ళారు

4. ఎండ్రకాయ కొంగ మాటను . . . . . . . . .

   (ఎ) నమ్మింది  (బి) నమ్మలేదు  (సి) రెండు సరికాదు

5. ఈ మూడింటిలో ఏది తెలివైనది? . . . . . . . . .

   (ఎ) చేపలు  (బి) ఎండ్రకాయ  (సి) కొంగ

# 12. రెడ్ క్రాస్

అది ఇరాన్ రాజధాని టెహరాన్. అర్ధరాత్రి సమయం. అంతా ప్రశాంతంగా ఉంది. ప్రజలంతా ఆదమరచి నిద్రిస్తున్నారు. కాసేపటిలో రాబోయే ఘోర విపత్తు గురించి వాళ్లకు తెలియదు. పన్నెండు గంటలా ముప్పై ఒక్క నిమిషాలకి భయంకరమైన భూకంపం సంభవించింది. దాదాపు నలభై వేల మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. అరవై వేల మంది గాయపడ్డారు. వార్తా ప్రసార వ్యవస్థ ఛిన్నాభిన్నమయింది. బయటి ప్రపంచంతో సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి.







ఈ ప్రమాద వార్తను ముందుగా గుర్తించి వీరికి సాయం అందించడానికి ఒక సంస్థ హుటాహుటిన వచ్చింది. ప్రథమ చికిత్సలు చేసి కావలసిన మందులు అందించింది. ఆహారం సరఫరా చేసింది. వసతి ఏర్పాట్లు చేసి ఆదుకుంది. ఆ సంస్థే 'రెడ్‌క్రాస్ సంస్థ'. ఇది ఒక అంతర్జాతీయ సేవా సంస్థ.

ఉత్తర ఇటలీలో 'సోలిఫెర్నో' అనే గ్రామం ఉంది. ఆ గ్రామంలో ఫ్రెంచి, ఇటలీ సైనికులకు, ఆస్ట్రియా సైనికులకు ఘోర యుద్ధం జరిగింది. ఎందరో సైనికులు ప్రాణాలు కోల్పోయారు. చాలామంది గాయాలతో కూలిపోయారు. ఆ సమయంలో స్విస్ దేశ యువకుడు 'హెన్రీడాంట్' ఫ్రాన్స్ చక్రవర్తి మూడవ నెపోలియన్‌ను కలవడానికి వచ్చాడు. యుద్ధ దృశ్యాలను చూశాడు. క్షతగాత్రుల బాధలను గమనించాడు. చలించిపోయాడు. వారికి ఎలాగైనా సహాయం చేయాలనుకున్నాడు. స్థానికుల సహకారం తీసుకున్నాడు. గాయపడిన ప్రతి సైనికుణ్ణి స్వయంగా పరామర్శించాడు. త్వరితగతిన వైద్య సహాయం అందించాడు.



డాంట్ చేసిన ఈ సేవాకార్యక్రమం అతని జీవిత విధానాన్నే మార్చివేసింది. "సోలిఫెర్నో జ్ఞాపకార్థం" పేరుతో ఒక పుస్తకం రాశాడు. దేశదేశాలలో స్వచ్ఛందసంస్థలు స్థాపించాడు. వాటికి అధికారికమైన గుర్తింపును ఇవ్వాలని ప్రభుత్వాలను కోరాడు. ప్రజల సూచనలను స్వీకరించాడు. ఈ సమయంలోనే ఈయనతోబాటు జనరల్ డ్యూఫోర్, వైద్యులు అపిరా, మనోయిర్, న్యాయవాది మాయనియర్‌లు కలిశారు.

ఈ ఐదుగురు 1863లో తీసుకున్న నిర్ణయం మేరకు "అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థ"ను స్థాపించారు. ఇందుకు ఎర్రటి ✚ గుర్తును రెడ్‌క్రాస్ చిహ్నంగా ఎన్నుకున్నారు.




యుద్ధాలలో క్షతగాత్రులైన వారికి అనేక సేవలు చేశారు. మొదటి ప్రపంచ యుద్ధంలో ప్రజల సహకారాన్ని కూడా పొందారు. 'సెంట్రల్ ట్రేసింగ్ ఏజెన్సీ' అనే అనుబంధ సంస్థని స్థాపించారు. దాని ద్వారా గాయపడిన వారి వివరాలను వారి కుటుంబాలకు తెలుపుతూ ఉత్తమ సేవలు అందించారు. ఇలాగే మరికొన్ని అనుబంధ సంస్థలు స్థాపించి బహుముఖ సేవలు అందించారు. రెడ్‌క్రాస్ సంస్థ ప్రధాన స్థావరం జెనీవాలో ఉంది.

రెడ్‌క్రాస్ సంస్థ రెండవ ప్రపంచ యుద్ధంలో కూడా అత్యుత్తమ సేవలు అందించింది. ప్రపంచమంతా శాఖోపశాఖలుగా విస్తరించింది. యుద్ధ సమయాల్లో, ప్రకృతి వైపరీత్యాల్లో సేవలు అందిస్తున్నది. 1965లో ఈ సంస్థ ఏడు లక్ష్యాలను ప్రకటించింది. అవి 1. మానవత్వం, 2. నిష్పక్షత, 3. తటస్థత, 4. స్వయంప్రతిపత్తి, 5. స్వచ్ఛంద సేవ, 6. ఐక్యత, 7. విశ్వజనీనత. వీరి దృష్టిలో బాధితులు ఎవరైనా ఒకటే. ఇలా రెడ్‌క్రాస్ సంస్థ అంతర్జాతీయ సమైక్యతకు, ప్రపంచ శాంతికి దోహదపడే సేవలు చేస్తున్నది.

మన దేశంలో కూడా ఈ సంస్థ రాష్ట్రపతి, రాష్ట్ర గవర్నర్ల ఆధ్వర్యంలో చక్కటి సేవా కార్యక్రమాలను అందిస్తున్నది. 1920 నుంచి రెడ్‌క్రాస్ సంస్థకు అనుబంధంగా అనేక దశలలో జూనియర్ రెడ్‌క్రాస్ సంస్థ, దాని శాఖలు పని చేస్తున్నాయి. వీటిలో పాఠశాల, కళాశాలల విద్యార్థులు సేవా కార్యకర్తలు. దీని ద్వారా విద్యార్థులకు కూడా సేవలు చేసే అవకాశం కలిగింది.

# 13. ఆడుకుందాం!

పిల్లలంతా ఉత్సాహంగా, ఆసక్తిగా ఆటను చూస్తున్నారు. "దివ్యా! నువ్వే బ్యాటింగ్ చెయ్యాల్సింది. పది పరుగులు చేస్తే మనం గెలుస్తాం. తొందరపడకు. విష్ణు బౌలింగ్‌లో ఆడటం కష్టం. అతను ఇప్పటికే నలుగురిని ఔట్ చేశాడు. అతని బౌలింగ్‌లో జాగ్రత్తగా ఆడు" అంటూ చెప్పింది జట్టు నాయకురాలు గౌతమి. సరేనంటూ చేతికి గ్లౌస్ తొడుగుకొని బ్యాట్ అందుకుంది దివ్య. రెండవ జట్టు నాయకుడు రాజు తన వారిని పిలిచాడు. ఫల్గుణ్, రాము, శ్రీవల్లి, చైతన్య, మల్లన్న, శివ అందరూ రాజు చుట్టూ చేరారు. అంతా కల్సి విష్ణుకు సూచనలు ఇచ్చారు. ఎలాగైనా దివ్యను ఔట్ చేయాలని, జాగ్రత్తగా ఫీల్డింగ్ చేయాలని అనుకొన్నారు. దివ్య బ్యాటింగ్ చేయడానికి సిద్ధంగా ఉంది. బంతి విష్ణు చేతుల్లో ఉంది. అంతా ఎవరి స్థానాల్లోకి వారు వెళ్లారు. విష్ణు బంతి పట్టుకొని పరిగెత్తుకుంటూ వచ్చి వేగంగా విసిరాడు. దివ్య అంతే వేగంగా బ్యాట్‌తో బంతిని బలంగా బాదింది. అంతే! బంతి మల్లన్న పక్క నుండి దూసుకుని పోయి బౌండరీ లైన్ దాటింది. గౌతమి, శ్రుతి, ఆశ, హరి అందరు చప్పట్లతో దివ్యను హుషారు పరచారు. రాజు విష్ణు వద్దకు వెళ్లి మాట్లాడాడు. విష్ణు ఓవర్‌లో ఇంకొక బంతి ఉంది. చివరి బంతిని విష్ణు వేశాడు. దివ్య బంతిని మెల్లగా నెట్టి, ఒక్క పరుగు తీసింది. ఇంకో ఐదు పరుగులు చేస్తే దివ్య వాళ్ల జట్టు గెలుస్తుంది. ఎలాగైనా గెలవాలని రాజు బంతిని ఫల్గుణ్ కిచ్చాడు. ఫల్గుణ్ బంతిని పట్టుకొని పరుగెత్తుతున్నాడు. వికెట్ల వెనుక శివ సిద్ధంగా ఉన్నాడు.

అందరూ ఉత్కంఠతో చూస్తున్నారు. ఈ లోకాన్నే మరచిపోయారు. బంతిని విసిరాడు ఫల్గుణ్. దివ్య బంతిని కొట్టడానికి ముందుకెళ్లింది. అంతే రెప్పపాటులో బంతి దివ్య బ్యాటును తాకి శివ వద్దకు వెళ్లింది. శివ దానిని క్యాచ్ పట్టాడు. దివ్య ఔటయింది. దిగాలుగా దివ్య తిరిగొచ్చింది. తానే స్వయంగా బ్యాట్ పట్టుకుని ఆడటానికి వచ్చింది గౌతమి. ఫల్గుణ్ బంతిని విసిరాడు. గౌతమి దాన్ని బలంగా కొట్టింది. బంతి రివ్వున వెళ్లి రేకుల పెడ్డుపై పడింది. దబ్బుమనే శబ్దం వచ్చింది.



ఎవర్రా ! అంటూ గుర్రుమంటూ గురవయ్య బయటికి వచ్చాడు. "ఒరేయ్! గురవయ్య తాత చే చిక్కామో, మనపని అంతే ! పరుగెత్తండి"అన్నాడు రాము. "రాజు! నువ్వు వికెట్లు పట్టుకురా" అంది గౌత "దివ్యా! నువ్వు బ్యాట్ తీసుకుని పరుగెత్తు" అన్నాడు విష్ణు. అంతే! నిమిషంలో అంతా అక్కడ నుం మాయమయ్యారు. బిలబిల మంటూ రావిచెట్టు కిందికి చేరుకున్నారు. గురవయ్య తాత భయా పరుగెత్తుకుంటూ వచ్చారుకదా! అంతా ఆయాసంతో రొప్పుతూ కూర్చున్నారు. "ఈ రోజు ఇక ఆట చాలు మళ్లీ రేపు ఆడుకుందాం" అన్నది శ్రుతి . "సరే ఇప్పుడేం చేద్దాం?" అని ప్రశ్నించింది దివ్య. "అంత్యాక్ష ఆడుకుందాం" అని మొదలుపెట్టింది గౌతమి. కొంతసేపయింది. వారికి అది కూడా విసుగనిపించింది. "ఎప్పుడూ పాటలేనా? ఇంకేదైనా ఆడదాం" అని దత్తు అన్నాడు. "ఏదైనా డ్రామా వేద్దాం" అన్నాడు ఫల్గుణ్. సరేనంటూ లేచారు అందరూ. రాము తనకు తెలిసిన కథ నాటికగా వేద్దాం అన్నాడు. కథకు పాత్రధారులను ఎన్నుకున్నారు. పాత్రధారులు కాక మిగిలినవారు ప్రేక్షకులు. డ్రామాకు కావలసిన సరంజామా సిద్ధం చేసుకున్నారు. చెట్టు కింద పెద్ద రాయి న్యాయాధికారి పీఠం, చిన్న బండలను ఆసనాలుగా చేసుకున్నారు.

డ్రామా మొదలైంది.



న్యాయాధికారిణి (శ్రుతి) : ఈ రోజు న్యాయం కోసం ఎవరెవరు వచ్చారు?

అమీనా (గౌతమి) : అమ్మా! ఈ దినం ఇద్దరు వర్తకులు న్యాయం కోసం వచ్చారు.

న్యాయాధికారిణి : అయితే వారిని ప్రవేశపెట్టండి. (వర్తకులు లోపలికి వస్తారు)

| | | |
|---|---|---|
| అమీనా | : | అమ్మా! ఈయన హేమంతుడు. ఈ ధీమంతునిపై అభియోగం తెచ్చాడు. |
| న్యాయాధికారిణి | : | సరే హేమంతా! నీ అభియోగం ఏమిటో చెప్పు. |
| హేమంతుడు (విష్ణు) | : | అమ్మా! నెలరోజుల క్రితం నేను వ్యాపార నిమిత్తం వేరే పట్టణానికి పోవలసి వచ్చింది. అక్కడ దొంగల భయం ఎక్కువ. |
| న్యాయాధికారిణి | : | అయితే? |
| హేమంతుడు | : | అందువల్ల దగ్గరుండే విలువైన ఆభరణాలు, డబ్బు నా స్నేహితుడైన ఈ ధీమంతుని ఇంట్లో ఉంచాలనుకున్నాను. అన్నీ ఒక జాడీలో భద్రపరచాను. సొమ్ము పైకి కనబడకుండా మా ఇంటి ఆవరణలో రాలిన ఆకులను పైన దట్టంగా పేర్చాను. జాడీ మూతిని గుడ్డతో బిగించాను. |
| న్యాయాధికారిణి | : | ఆ తర్వాత ఏం చేశారు? |
| హేమంతుడు | : | ధీమంతునికి జాడీ ఇచ్చాను. 'నెల రోజుల్లో వస్తాను. అప్పటి వరకు ఈ జాడీని జాగ్రత్తగా భద్రపరచ'మని చెప్పాను. నెల తరువాత వచ్చి నా జాడీ తీసుకున్నాను. ఇంటికి వెళ్లి తెరచి చూశాను. (ఏడుస్తాడు . . . .) |
| న్యాయాధికారిణి | : | చూస్తే! ఏమయ్యింది? చెప్పండి. |
| హేమంతుడు | : | జాడీలో నేను దాచిన ఆభరణాలు కొన్నే ఉన్నాయి. పోయినవాటిలో రత్నాల హారం ఉంది. దానిని ఎంతో మమకారంతో మా అమ్మ నాకిచ్చింది. సొమ్ము బదులు ఆకులే ఎక్కువగా ఉన్నాయి. ఈ ధీమంతుడు మోసం చేశాడు. దయచేసి నాకు న్యాయం చేయండి. (భోరున ఏడుస్తాడు) |
| న్యాయాధికారిణి | : | ఏమయ్యా! అతడు చెప్పినది నిజమేనా? |
| ధీమంతుడు (రాజు) | : | అమ్మా! హేమంతుడు జాడీని ఇవ్వడం నిజమే. కానీ ఆ జాడీలో ఏముందో నాకు తెలియదు. లేనివి ఉన్నాయని చెప్పి అతడే నన్ను మోసం చేయాలని చూస్తున్నాడు. |

(ఎన్నిసార్లు, ఎన్ని రకాలుగా అడిగినా ఇదే జవాబు రావడంతో న్యాయాధికారిణి ఆ జాడీని తీసుకు రమ్మని ఆదేశించింది.)

హేమంతుడు : ఇదిగో అమ్మా! ఈ ఆకులు. ఈ సొమ్ములు.

(ఏడ్పు ముఖంతో చూపించాడు. న్యాయాధికారిణి జాడీలోని వస్తువులను జాగ్రత్తగా పరిశీలిస్తుంది.)

న్యాయాధికారిణి : ధీమంతుడే దోషి. ధీమంతా! నువ్వు హేమంతుని జాడీ నుండి తీసిన సొమ్ము తిరిగి ఇచ్చెయ్యి. లేదా, అతడు అడిగిన ధనాన్నైనా ఇచ్చెయ్యి.

ధీమంతుడు : అమ్మా! నేనెందుకు ఇవ్వాలి? నేను తియ్యనిదాన్ని ఎలా ఇవ్వగలను?

న్యాయాధికారిణి : బుకాయించకు ధీమంతా! నువ్వే దోషివి. నీవు తీశావో లేదో నేను నిరూపిస్తాను. హేమంతుడు ఊరు వదలి నెల రోజులయ్యింది. పై పొరలోని ఆకులు ఎండిపోయి అడుగున ఉన్నవి కొద్దిగా పచ్చిపచ్చిగా ఉండాలి. కానీ ఇక్కడ ఆకులన్నీ తాజాగా ఉన్నాయి. నిన్ను శిక్షించకుండా అతని సొమ్ము అతనికి ఇవ్వమంటున్నాను.

ధీమంతుడు : పొరపాటయ్యింది. నేనే దోషిని. హేమంతుని వస్తువులు తిరిగి ఇచ్చి వేస్తాను.

న్యాయాధికారిణి : ధీమంతా! ఎవరినీ మోసం చెయ్యకూడదు. ఇంకోసారి ఇలా జరిగితే కఠినమైన శిక్ష విధిస్తాను.

హేమంతుడు : కృతజ్ఞతలమ్మా.

(పిల్లల చప్పట్లతో ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనించింది)

చీకటి పడుతుందని వారిని వెదకుతూ, వచ్చింది దత్తు, హరిల నాయనమ్మ. ఇదంతా చూసింది. న్యాయాధికారిణి ధీమంతుడినే దోషి అని చెప్పడం చూసి ఆశ్చర్యపోయింది. దత్తు, హరిలను తీసుకొని వెళ్లింది. రోజూ ఇలాగే కొత్త కొత్త ఆటలు ఆడాలని అనుకొని, అంతా ఎవరి ఇండ్లకు వారు వెళ్లారు.

## ఇవి చేయండి.

**అ. ఏదైనా ఆటను ఆడేటప్పుడు ఉన్నది ఉన్నట్లుగా వర్ణించి చెప్పండి. దీన్ని ఏమంటారో తెలుసుకోండి.**

# 14. కుందేలు తెలివి

ఒక అడవిలో పెద్ద సరస్సు ఉండేది. ఆ సరస్సు ఒడ్డున ఉన్న పొదల్లో చాలా కుందేళ్లు నివసించేవి. సరస్సు చుట్టూ ఉన్న అడవి అంతా కలయ తిరిగేవి. దుంపలు, కాయలు తినేవి. సరస్సులోని నీరు తాగేవి. ఆడుతూ పాడుతూ హాయిగా జీవించేవి. వాటికి సుబుద్ధి అనే ముసలి కుందేలు నాయకత్వం వహించేది. కుందేళ్లకు ఎటువంటి కష్టం వచ్చినా తన తెలివితేటలతో, సమయస్ఫూర్తితో ఎదుర్కొని కాపాడేది.



కాలమంతా ఒకేరీతిగా సాగదు కదా! కష్టాలు, సుఖాలు ఒకదాని వెంట ఒకటి వస్తుంటాయి. ఒకసారి ఈ కుందేళ్లకు ఒక కష్టం వచ్చింది. పక్కనున్న అడవి నుండి ఒక ఏనుగుల గుంపు వచ్చింది. కుందేళ్లుండే పొదలను తొక్కుకుంటూ సరస్సు చేరింది. చాలా కుందేళ్లు వాటి కాళ్ల కింద పడి గాయపడ్డాయి. సరస్సులో ఏనుగులు ఎంతో కోలాహలం చేశాయి. నీళ్లను తొండాలతో చిమ్ముకున్నాయి. ఆనందంగా ఒక దాన్ని మరొకటి తోసుకున్నాయి. సరస్సునంతా బురదమయం చేశాయి. మళ్లీ పొదలను తొక్కుకుంటూ వెళ్లిపోయాయి. కుందేళ్లన్నీ బెదరిపోయాయి.

ఆ రోజు రాత్రి వెన్నెల్లో కుందేళ్లన్నీ సమావేశమయ్యాయి. ఏనుగుల వల్ల కలిగిన ఇబ్బందుల గురించి చర్చించాయి. వీటి బారి నుండి ఎలాగైనా తమని కాపాడమని సుబుద్ధిని వేడుకున్నాయి. సుబుద్ధి కూడ తీవ్ర ఆలోచనలో పడింది. మిత్రులతో కలిసి మంత్రాంగం చేసింది. అటూ ఇటూ తిరుగుతూ కాకతాళీయంగా ఆకాశం వైపు చూసింది. వెన్నెల వెదజల్లుతున్న చంద్రుడు కనిపించాడు. అపుడు దానికి తళుక్కుమని ఒక ఆలోచన తట్టింది. దాన్ని అమలు చేయాలనుకుంది. కుందేళ్లకు అభయమిచ్చి పంపేసింది.

మరుసటి రోజు సుబుద్ధి ఏనుగులు వచ్చే మార్గంలో గుట్టపై ఉన్న రాయి మీద నిలబడింది. వాటి రాక కోసం ఎదురు చూడసాగింది. ఇంతలో ఏనుగుల అలికిడి వినబడింది. ఏనుగుల రాజు చతుర్దంతి ముందురాగా, ఏనుగులన్నీ వెనుక వస్తున్నాయి.



గజరాజుతో సుబుద్ధి 'నమస్కారం' అంది. మాటలు విన్న చతుర్దంతి చుట్టూ కలయచూసింది. రాతి మీద ఉన్న కుందేలును గుర్తించింది. తొండం పైకెత్తి 'ఎవరు నీవు?' అని కోపంతో ఘీంకరించింది. సుబుద్ధి భయపడలేదు. 'శాంతమూర్తిగా ఉండే చంద్రదేవునికే మీరు ఆగ్రహం కలిగించారు. సరస్సును అపవిత్రం చేశారు. మీరు తక్షణం ఈ అడవి విడిచి వెళ్లాలి. లేకుంటే చల్లని కిరణాలనిచ్చే చంద్రదేవుడు అగ్ని కిరణాలను ప్రసరించి మిమ్మల్ని దహిస్తాడు' అని చెప్పింది.



తొణుకు బెణుకు లేకుండా ధైర్యంగా సుబుద్ధి పలికిన పలుకులకు చతుర్దంతి ఆలోచించింది. 'కుందేలా! నీ మాటలు నేను నమ్మలేకుండా ఉన్నాను' అంది. అందుకు సుబుద్ధి 'గజరాజా! రాత్రికి వెన్నెల రానీయండి. మా చంద్రదేవుని ఉగ్రరూపం చూద్దురుగాని' అంది. ఆ రోజు పున్నమి రాత్రి. ఆకాశంలో చంద్రుడు బంగారు పళ్లెంలా వెలిగిపోతూ వచ్చాడు. అపుడు సుబుద్ధి చతుర్దంతిని సరస్సు దగ్గరికి తీసుకెళ్లింది. నీటిలో చంద్రుని ప్రతిబింబాన్ని చూపింది.



నీటి అలల్లో చంద్ర బింబం ఎర్రగా కదులుతూ కనిపించింది. 'చూశావా గజరాజా! చంద్రదేవుడు ఉగ్రరూపంతో ఎలా వణికిపోతున్నాడో' అని చెప్పింది. అది చూశాక చతుర్దంతి నిజంగానే హడలిపోయింది. తన అనుచరులను వెంటబెట్టుకొని వెళ్లిపోయింది. మరల సరస్సు వైపు తిరిగి చూడలేదు. ఆనందంతో కుందేళ్లు గంతులేశాయి. సుబుద్ధిని కీర్తించాయి. ఆపై ఎంతో సుఖంగా జీవించాయి. బలహీనులైనా బుద్ధి కుశలత ఉంటే బలమైన శత్రువుల నుండి తమని తాము రక్షించుకోవచ్చు.

## ఇవి చేయండి.

అ. కింది చిత్రాలను పరిశీలించి వాటి ఆధారంగా ఆ కథను సొంత మాటల్లో చెప్పండి.



# 15. పులి - గిరి



రుద్రయ్య, ముత్యాలమ్మ దంపతులు. ఒకరోజు ముత్యాలమ్మ విస్తళ్లకు ఆకుల కోసం రుద్రయ్యను అడవికి పంపింది. రుద్రయ్య వాటి కోసం అడవిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఇంతలో కొంతమంది రత్నాపురం రాజసైనికులు ఒక గజదొంగను తరుముకుంటూ వస్తున్నారు. సైనికులను చూడగానే రుద్రయ్యకు భయం వేసింది. అడ్డదిడ్డంగా పరుగెత్తాడు. రుద్రయ్య కాళ్లకు పారిపోతున్న గజదొంగ అడ్డం వచ్చాడు. దొంగ బోర్లాపడ్డాడు. భటులు దొంగను బంధించారు. రుద్రయ్యను కూడా రాజు వద్దకు తీసుకొని వెళ్లారు. రుద్రయ్యే దొంగను బంధించడానికి కారణమని రాజు అనుకున్నాడు. ఉద్యోగమిచ్చి సత్కరించాడు.

రాజుకు పశువుల మందలతోబాటు గొర్రెల మందలు కూడా చాలా ఉన్నాయి. ఒక పులి రోజూ రాత్రిపూట గొర్రెల మందలో చేరి వాటిని తింటూ ఉండేది. రాజు పులి బెడదను తప్పించే పనిని రుద్రయ్యకు అప్పగించాడు. రుద్రయ్య ఒకరోజు చీకటిపడ్డాక గొర్రెల మందలున్న తావుకు వెళ్లాడు. "పులిని పట్టేస్తా. అది పులైతే దాని తలదన్నే గిలిని నేను" అని బీరాలు పలికాడు. గొర్రెల కాపరులను పంపేశాడు. ఈ ఉద్యోగం వద్దు, పాడూ వద్దు. బాగా బలిసిన గొర్రెను ఒకదాన్ని తీసుకొని ఎక్కడికైనా పారిపోదాం అనుకున్నాడు. అప్పటికే పులి మందలో ఉంది. రుద్రయ్య బీరాలు విని భయపడింది. కళ్లు మూసుకుంది. రుద్రయ్య మళ్లీ అరిచాడు. "పులిని తలదన్నే గిలిని నేను" అని. గిలంటే తనకంటే పెద్ద జంతువని, దానినుండి తప్పించుకోవాలని మందలో కదలకుండా పడుకుంది పులి. చిమ్మచీకటిలో బలమైన గొర్రె కోసం వెతుకుతున్న రుద్రయ్యకు పులి తగిలింది.



అదే బలమైన గొర్రె అనుకొని దాని మెడకు తాడు కట్టి భుజాన ఎత్తుకున్నాడు. పులి కూడా ఇది గిల్లి అనుకొని కదలకుండా ఉండిపోయింది. రుద్రయ్య ఇంటికి వెళ్లి పులిని గుంజకు కట్టేశాడు. భార్యను కేకేసి దీపం తెమ్మన్నాడు. గొర్రె ఎంత బలంగా ఉందో చూద్దామన్నాడు. ముత్యాలమ్మ దీపం తెచ్చింది. వెలుతురులో పులిని చూడగానే అరిచింది. పరుగు లంకించుకుంది. పులి కూడా వారిని చూస్తూనే కోపంతో గాండ్రించింది. కానీ ఏమీ చేయలేకపోయింది. రుద్రయ్యకు మళ్లీ అదృష్టం కలిసి వచ్చింది. సంతోషంతో రాజు రుద్రయ్యను సైన్యంలో అధికారిగా నియమించాడు.

రత్నాపురంలో కొబ్బరి తోటలు కూడా మెండుగా ఉన్నాయి. ఒక ఎలుగుబంటు కొబ్బరి చెట్లు ఎక్కి కాయలు పాడు చేస్తూ ఉండేది. రాజుగారి ఆజ్ఞ మేరకు రుద్రయ్య ఎలుగు బంటును పట్టవలసి వచ్చింది. ఆ రాత్రి శూలం, దీపం తీసుకొని కొబ్బరి తోటకు వెళ్లాడు. దారిలో దీపం ఆరిపోయింది. తోట చేరిన రుద్రయ్య శూలాన్ని నేలపై నిలువుగా గుచ్చాడు. దీపం అంటించడానికి నిప్పు వెలిగించాడు. కానీ అంతకు పూర్వమే ఎలుగుబంటు చెట్టు ఎక్కి కూర్చుంది.

నిప్పును చూడగానే భయంతో చెట్టు పైనుంచి కిందికి దూకింది. నేరుగా శూలంపై పడి చనిపోయింది. రుద్రయ్య తనపై ఏదో పడిందని భయపడి స్పృహతప్పి పడిపోయాడు. ఆ మార్గంలో వచ్చిన సైనికులు రాజుకు ఈ సంగతి చెప్పారు. ఎలుగుబంటు బాధ తప్పినందుకు రాజు సంతోషించాడు. రుద్రయ్యను అంగరక్షకుడిగా నియమించాడు.



కొన్ని రోజులు గడిచాయి. రత్నపురం మీద పొరుగురాజు దండెత్తి వచ్చాడు. యుద్ధానికి సిద్ధం కమ్మని రాజు రుద్రయ్యను ఆజ్ఞాపించాడు. రుద్రయ్యకు యుద్ధమంటే భయం. రాజుకు చెప్పలేడు. ఒక ఉపాయం ఆలోచించి ఒక ముసలి గుర్రానికి తనని కట్టేయమని చెప్పాడు. అందరితోబాటు యుద్ధానికి సిద్ధమయ్యాడు. యుద్ధభేరి మోగింది.

అలవాటు లేని గుర్రాలు కొన్ని అటూ ఇటూ పరుగెత్తాయి. యుద్ధంలో ఆరితేరిన ముసలి గుర్రం మాత్రం నేరుగా శత్రువుల పైకి పరుగెత్తసాగింది. "తాడు తెగితే క్రిందపడి చస్తాడు" అన్నట్లు రుద్రయ్య పని కష్టమయింది. ప్రాణం తప్పించుకోవాలని గుర్రాన్ని రెండు తాటి చెట్ల మధ్య పోనిచ్చాడు. పోనిస్తూ పోనిస్తూ ఆ రెండు చెట్లను రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. కానీ గుర్రం పరుగు వేగానికి రెండు చెట్లూ పెకిలించుకొని పోయి చేతులకు చిక్కాయి. రెండు చేతులా రెండు తాటి చెట్లతో వస్తున్న రుద్రయ్యను చూడగానే శత్రువులు బెంబేలెత్తిపోయారు. ఇంత బలవంతుడితో యుద్ధం చేయలేమని కాలికి బుద్ధి చెప్పారు. రత్నపురం రాజు యుద్ధంలో గెలిచాడు.



# 16. దేశబాంధవి



'ఉరిమింది భరతజాతి - రగిలింది ప్రజాశక్తి
మోగింది విజయభేరి - ఎగిరింది జాతీయ జెండా'
అని పాడింది.

"స్వేచ్ఛను పొందండి. ఆనందాన్ని అనుభవించండి, ఈ శుభవేళలో తీపి తినండి" అంటూ అందరికీ మిఠాయిలు పంచింది. తన వాక్చాతుర్యంతో అందరినీ ముగ్ధుల్ని చేసింది. ఆమె ఎవరో కాదు, దువ్వూరి సుబ్బమ్మ. భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమంలో చెరసాలకు వెళ్ళిన మొదటి ఆంధ్ర మహిళగా గుర్తింపు పొందింది. ఉద్యమంలో సాహసాలను ప్రదర్శించిన ధైర్యశాలి. బాపూజీ 'దేశబాంధవి'గా గుర్తించిన త్యాగమూర్తి.

దువ్వూరి సుబ్బమ్మ 1880వ సంవత్సరం నవంబరు 15వ తేదీన జన్మించింది. తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా ద్రాక్షారామం ఆమె జన్మస్థలం. వారిది సనాతన కుటుంబం. తల్లి వెంకట రమణమ్మ. తండ్రి మల్లాది సుబ్బావధా నాటి ఆచారం ప్రకారం సుబ్బమ్మకు చిన్నతనంలోనే వివాహం జరిగింది. ఆమె భర్త దువ్వూరి వెంక సుబ్బయ్య. వారికి సంతానం లేదు. సుబ్బయ్య నడివయస్సులోనే మరణించాడు. భర్త మరణం ఆమెను కుంగదీసింది. ప్రజలే బిడ్డలుగా, దేశసేవే కర్తవ్యంగా భావించింది. మొదటిసారిగా 1921లో కాకినాడలో జరిగిన రాజకీయ మహాసభకు వెళ్లింది. ఆ సభకు టంగుటూరి ప్రకాశం అధ్యక్షులు. ఆ సభలో సుబ్బమ్మ 'సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యం' అనే తీర్మానాన్ని బలపరుస్తూ అనర్గళంగా ఉపన్యసించింది. అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఆ సంఘటన ఆమె జీవితాన్నే మార్చివేసింది. నాటి నుండి భారత స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించింది.

సుబ్బమ్మ చెల్లపిళ్ల వెంకట శాస్త్రి గారికి శిష్యురాలు. ఆమె సంస్కృత, ఆంధ్ర భాషలలో విదుషీమణి. తన పాండిత్యాన్ని, వక్తృత్వ శక్తిని ఉద్యమానికి అర్పించింది. స్వాతంత్ర్య ఉద్యమంలో తానొక సమిధగా మారింది.

ఉద్యమ కాలంలో సుబ్బమ్మ తన పాటలతో ప్రజలను ఉత్తేజపరిచింది. ఇది బ్రిటిషు పాలకుల గుండెల్లో గుబులు రేపింది. పెద్దాడ సుబ్బమ్మ, చల్లపల్లి సీతాదేవి, ఉన్నవ లక్ష్మీబాయమ్మ వంటి ఉద్యమ కార్యకర్తలు ఆమె వెంట ఉండేవారు. తన మేనమామ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఆశువుగా చెప్పిన 'భరతఖండంబు

వక్కని పాడియావు' అనే పద్యాన్ని రాగయుక్తంగా అభినయిస్తూ, గంభీరమైన కంఠంతో సుబ్బమ్మ పాడేది. మైకులు లేని ఆ కాలంలో ఆమె కంఠం చాలా దూరం వినిపించేది.

బ్రిటిషు రక్షక దళాలు ఆ పాటలు విని సహించలేకపోయేవారు. ఆ పాటలు ప్రజలకు వినపడకుండా డప్పులు, డబ్బాలు వాయించేవారు. కోపం పట్టలేని సుబ్బమ్మ "నేను గంగా భాగీరథీ సమానురాలను. తలుచుకుంటే మిమ్మల్ని గంగలో ముంచెత్తగలను. కానీ నేను గాంధీజీ ఆదేశానుసారం అహింసావ్రతం చేపట్టాను. నా దగ్గర కాదు మీ కుప్పిగంతులు. జాగ్రత్త!" అనేది. ఆ గర్జన వినగానే పోలీసులు చల్లగా జారుకొనేవారు.



1922వ సంవత్సరంలో గాంధీజీ తలపెట్టిన సహాయ నిరాకరణోద్యమంలో సుబ్బమ్మ ప్రధాన పాత్ర వహించింది. అప్పటికి భారతదేశంలో ఉద్యమాల్లో పాల్గొన్న స్త్రీలు చాల తక్కువ. ఆమె అద్భుతమైన ఉపన్యాసాలు ప్రజలను ఆకట్టుకొనేవి. ఇది గమనించిన బ్రిటిష్ అధికారులు ఆమెను నిర్బంధించారు. క్షమాపణ కోరితే వదలిపెడతామన్నారు. దానికి ఆమె అంగీకరించలేదు. పట్టుదల, మొండిధైర్యం, దీక్ష ఆమె గుణాలు. సుబ్బమ్మ ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా వంటి ఉద్యమాలలో పాల్గొని ఎన్నోసార్లు జైలుశిక్ష అనుభవించింది. జైలులో కూడా పాటలు పాడేది ఆమె. అవసరమైన వస్తువులను జైలు అధికారులచే తెప్పించేది. జైలు అధికారులు ఆమె అంటే హడలిపోయేవారు.

ఒకసారి పెద్దాపురంలో వన భోజనాల పేరుతో పెద్దాడ కామేశ్వరమ్మ రాజకీయ సభ ఏర్పాటు చేసింది. అది పసిగట్టిన బ్రిటిషు రక్షక దళాలు అక్కడకు వచ్చి వారి మీద లాఠీచార్జి చేశాయి. దీనితో ఆగ్రహించిన సుబ్బమ్మ పోలీసులపై విరుచుకుపడింది. ఆమె ధాటికి ఆగలేక పోలీసులు అక్కడనుండి మాయమయ్యారు.

గాంధీజీ మాట ప్రకారం సుబ్బమ్మ ఖద్దరు బట్టల మూటను నెత్తిన పెట్టుకొని ఊరూర తిరిగి అమ్మింది. ఆ ధనాన్ని జాతీయోద్యమానికి సమర్పించింది. ఉదారులైన వారి నుండి విరాళాలు సేకరించి స్త్రీలకు ఉచిత విద్యాబోధన, వసతి, భోజన సదుపాయాలు సమకూర్చింది. విజ్ఞానాన్ని, వివేకాన్ని స్త్రీలలో కలిగించాలని రాజమహేంద్రవరంలో బాలికల పాఠశాలను స్థాపించింది. దాన్ని జాతీయ సంస్థగా నడిపించింది.

దువ్వూరి సుబ్బమ్మ తన ఆస్తినంతా స్వాతంత్ర్య ఉద్యమం కోసం ఖర్చు పెట్టింది. స్వరాజ్యం వచ్చినపుడు ఎంతగానో సంతోషించింది. 1964వ సంవత్సరం మే 31వ తేదీన మరణించింది. మనకు ఆదర్శప్రాయంగా నిలిచింది.

# 17. మన దేశం



మనది భారతదేశం. మనం భారతీయులం. ఒకప్పుడు భరతుడు అనే చక్రవర్తి ఈ దేశాన్ని పరిపాలించాడు. అందువలన ఈ దేశానికి భారతదేశం అన్న పేరు వచ్చింది. హిందూదేశం అని కూడా మన దేశానికి పేరుంది. హిందు, సింధు నుంచి ఏర్పడిన పదం. సింధూ నది ప్రవహించే దేశం కాబట్టి హిందూదేశం అని పేరు వచ్చింది. భారతదేశం వివిధ జాతులకు, భాషలకు నిలయం. ఎన్నో మతాలకు, రకరకాల ఆచార వ్యవహారాలకు ఈ దేశం వాసికెక్కింది. భారతదేశ పటం చూస్తే దాని భౌగోళిక స్వరూపం ఎంత అందంగా ఉందో తెలుస్తుంది.

భారతదేశం ప్రకృతి స్వరూపం కూడా ఎంతో సుందరంగా ఉంటుంది. ఎత్తైన పర్వతాలు, లోయలు, నదులు, అడవులు, పచ్చిక బీళ్లు దేశం అంతటా వ్యాపించి ఉన్నాయి. దేశానికి ఉత్తరాన పెట్టని కోట గోడలలాగా ఎత్తైన హిమాలయ పర్వతాలున్నాయి.

దేశానికి మధ్య వింధ్య పర్వతాలున్నాయి. వింధ్యకు ఉత్తరాన ఉన్న ప్రాంతాన్ని ఉత్తర భారతదేశమని, దక్షిణాన ఉన్న ప్రాంతాన్ని దక్షిణ భారతదేశమని పిలుస్తున్నాం. దక్షిణ భారతదేశంలో దక్కన్ పీఠభూమి ఉంది. ఇది ఎత్తైన విశాలమైన ప్రాంతం. మన దేశానికి దక్షిణాన హిందూ మహా సముద్రం, తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన అరేబియా సముద్రం ఉన్నాయి. మూడువైపులా ఉన్న సముద్రాలు వేల సంవత్సరాలుగా విదేశాలతో వ్యాపారం చేయడానికి ఉపయోగపడుతున్నాయి. దేశ భద్రతకు, రకరకాల ఉత్పత్తులకు ఈ సముద్ర తీరాన్ని ఉపయోగిస్తున్నాం. హిమాలయాల్లో పుట్టి ప్రవహించే గంగ, యమున, బ్రహ్మపుత్ర నదులు, దక్షిణాన ప్రవహించే గోదావరి, కృష్ణా నదులు, మన దేశాన్ని సస్యశ్యామలం చేస్తున్నాయి. వీటిపై నిర్మించిన ప్రాజెక్టులు బహుళ ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నాయి. పంటలకు నీటిని అందిస్తున్నాయి. జలవిద్యుత్తు ఉత్పత్తికి దోహదపడుతున్నాయి. రవాణాకు, మత్స్య పరిశ్రమకు సహాకరిస్తున్నాయి.

మన దేశానికి ఉత్తరాన సింధూ నదీ ప్రవహించే ప్రాంతంలో హరప్పా, మొహంజొదారోలలో మన ప్రాచీన నాగరికత ఆనవాళ్లు కనిపిస్తాయి. ఈ నాగరికత ప్రపంచంలోనే ప్రాచీనమైన నాగరికతలలో ఒకటి. సుమారు మూడున్నర వేల సంవత్సరాలకు పూర్వం ఈ నాగరికత విలసిల్లింది. చక్కగా ఒక పద్ధతిలో నిర్మించిన నగరాలు, ఇటుకలతో కట్టిన ఇళ్ళు, మట్టిపాత్రలు, వస్త్రాల తయారీ చాలా అభివృద్ధి చెందిన దశలో ఇక్కడ కనిపిస్తాయి.

ప్రపంచంలోనే చాలా ప్రాచీనమైన సాహిత్యం భారతదేశంలో కనిపిస్తుంది. కొన్ని వేల సంవత్సరాలకు మునుపు వేద సాహిత్యం ఇక్కడ పుట్టింది. రామాయణ, భారత ఇతిహాసాలు, భాగవతం మొదలైన పురాణాలన్నీ ఇక్కడ వెలిశాయి. కాళిదాసు మహాకవిగా తన రచనలతో విదేశీయులను కూడా ముగ్ధులను చేశాడు. భవభూతి, భారవి, భట్టబాణుడు ప్రసిద్ధి పొందిన భారతీయ కవులు. పైశాచి భాషలో రాసిన బృహత్కథ ప్రపంచ కథా సాహిత్యంలోనే వాసికెక్కింది. వెయ్యి సంవత్సరాలకు పైగా భారతదేశంలోని అనేక భాషలలో గొప్ప సాహిత్యం వచ్చింది. తిరువళ్ళువర్, జ్ఞానదేవ్, తుకారాం, కబీరు, వేమన, సుబ్రహ్మణ్య భారతి వంటి కవులు ప్రజలలో చైతన్యం కలిగించారు.

భారతదేశం కళలకు కాణాచి. అజంతా ఎల్లోరాలు, శిల్ప చిత్ర కళలకు, అమరావతి శిల్ప సంపద చెప్పుకోతగ్గవి. కథక్, మణిపురి, ఒడిస్సి, భరతనాట్యం, కథాకళి, కూచిపూడి నృత్య విధానాలు ప్రపంచంలోనే

మణిపురి, ఒడిస్సి, భరతనాట్యం, కథాకళి.









పేరు పొందాయి. హిందుస్తానీ, కర్ణాటక సంగీత రీతులు కూడా చెప్పుకోతగ్గవి. తాన్‌సేన్, త్యాగయ్యల నుండి నేటి యం.యస్. సుబ్బులక్ష్మి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ వరకు దేశాన్ని, ప్రపంచాన్ని తమ సంగీతంతో అలరించినవారే. ఉత్తర భారతంలో హిందుస్తానీ సంగీతం, దక్షిణ భారతంలో కర్ణాటక సంగీతం ప్రసిద్ధి పొందాయి.

మన సుందర భారత భూమిని అన్ని విధాల సుసంపన్నం చేసుకోవలసిన కర్తవ్యం మనందరి మీద ఉంది. మన సంస్కృతిని, వారసత్వాన్ని ముందుకు తీసుకుపోవలసిన బాధ్యత ప్రతి ఒక్కరి మీద ఉంది.

# 18. కవిత్రయం

మమత : తాతయ్యా! ఇవాళ ఆదివారం కదా! మమ్మల్ని ట్యాంక్ బండ్‌కు తీసుకుని వెళ్లవూ!

మాధవి : అవును తాతయ్యా! ట్యాంక్ బండ్ మీద ఎన్నో విగ్రహాలు ఉన్నాయట కదా! వాటిల్లో కొందరు కవుల విగ్రహాలు కూడా ఉన్నాయట. వాటిని చూడాలని ఉంది తాతయ్యా!

తాతయ్య : అవును. ట్యాంక్‌బండ్ మీద ప్రముఖుల కాంస్య విగ్రహాలు మనకు ఎన్నో కనబడతాయి.

మాధవి : చెల్లాయ్! ట్యాంక్ బండ్ మీద నుండి చూస్తే మనకు హుస్సేన్‌సాగర్‌లో బుద్ధుని విగ్రహం కనబడుతుందట.

మమత : నాకు కూడా ఆ విగ్రహాలను చూడాలని ఉంది. తాతయ్యా! తప్పకుండా మమ్మల్ని ట్యాంక్ బండ్‌కు తీసుకుని వెళతారు కదూ!

తాతయ్య : ఆ! ఆ! అక్కడికే వెళ్దాం! తయారవండి.



మమత : అబ్బ! చల్లటి గాలి! ఎంత హాయిగా ఉందో! అటు చూడక్కా! హుస్సేన్‌సాగర్‌లో పడవలు తిరుగుతున్నాయి.

మాధవి : బుద్ధుని విగ్రహం కూడా కనబడుతోంది.

మమత : అమ్మో! ఎంత ఎత్తుగా ఉందో!

తాతయ్య : ఆ! ఆ! పిల్లలూ! అది సరే కాని, జాగ్రత్త! రోడ్డు పక్కన నడవండి. బస్సులు వేగంగా వస్తున్నాయి.

మమత : అలాగే తాతయ్యా!

మాధవి : తాతయ్యా! ఇక్కడ వరుసగా అందంగా విగ్రహాలు కనబడుతున్నాయి.

తాతయ్య : పిల్లలూ! మొదటి విగ్రహం చూశారా?

మాధవి : ఓ! శాలివాహనుని విగ్రహం ఇది! ఈయన గుర్రం ఎక్కి సవారీ చేస్తున్నాడు.

తాతయ్య : ఆంధ్ర దేశాన్ని పాలించిన రాజులలో శాలివాహనుడు ముఖ్యుడు. ఇతని పేరుతో ఒక శకం కూడా ఉంది.



మమత : తరువాత విగ్రహం చూద్దామా? అక్కయ్యా!

మాధవి : ఇది నన్నయభట్టు విగ్రహం.

మమత : ఈయన కూర్చుని ఏదో రాస్తున్నాడే!

తాతయ్య : అవును మమతా! ఆయన ఆంధ్ర మహాభారతం రాశాడు. 'తింటే గారెలే తినాలి. వింటే భారతమే వినాలి' అన్న సామెత విన్నారు కదా! మహాభారతాన్ని సంస్కృతంలో వేదవ్యాసుడు రాశాడు. నన్నయ, తిక్కన, ఎర్రాప్రగడలు మహాభారతాన్ని తెలుగులో రాశారు.

మాధవి : నన్నయ ఎక్కడ ఉండేవాడు తాతయ్యా?

తాతయ్య : నన్నయ రాజమహేంద్రవరంలో రాజరాజనరేంద్రుని ఆస్థానంలో ఉండేవాడు. ఆ రాజు కోరిక మేరకు సంస్కృత భారతాన్ని నన్నయ తెలుగులో రాశాడు. ఈయన ఆది, సభా పర్వాలను, అరణ్య పర్వంలో కొంతభాగాన్ని రాశాడు. నన్నయను తెలుగులో 'ఆదికవి' అంటారు.

తాతయ్య : ఆయనకు వాగనుశాసనుడు అనే బిరుదు కూడా ఉంది. నన్నయ 11వ శతాబ్దం వాడు.

తాతయ్య : తరువాత విగ్రహం చూడండి పిల్లలూ!

మాధవి : ఈ విగ్రహం కింద 'తిక్కన సోమయాజి' అని రాసి ఉంది.



తాతయ్య : తిక్కన యజ్ఞం చేశాడు. అందువల్ల ఆయనను సోమయాజి అంటారు. తిక్కన నెల్లూరును పాలించిన మనుమసిద్ధి రాజు వద్ద మంత్రిగా ఉండేవాడు. ఈయన 13వ శతాబ్దం వాడు. మంత్రాంగం చేయడంలోనే కాకుండా కవిత్వం రాయడంలో కూడా దిట్ట.

మమత : తిక్కన ఏ పర్వాలు రాశాడు?

తాతయ్య : మహాభారతంలో విరాట పర్వం మొదలు పదిహేను పర్వాలు రాశాడు. ఆయనకు 'కవి బ్రహ్మ', 'ఉభయ కవి మిత్రుడు' అనే బిరుదులు ఉన్నాయి.

మాధవి : తిక్కన ఇంకా ఏమైనా రాశాడా తాతయ్యా?

తాతయ్య : తిక్కన నిర్వచనోత్తర రామాయణం అనే మరో కావ్యం రాశాడు.

మాధవి : మరి తాతయ్యా! నన్నయ అరణ్య పర్వంలో సగం మాత్రమే రాశాడని చెప్పావు. మిగిలిన భాగం ఎవరు రాశారు?

తాతయ్య : నీకు బాగా గుర్తుంది మాధవీ! భారతంలో అరణ్య పర్వంలో మిగిలిన భాగాన్ని ఎర్రన రచించాడు. ఇలా ఎర్రన కూడా భారత రచనలో పాలు పంచుకున్నాడు. అదిగో చూడండి పిల్లలూ! ఎర్రన విగ్రహం.



మాధవి : ఎర్రన ఎవరి ఆస్థానంలో ఉండేవాడు తాతయ్యా?

తాతయ్య : ఎర్రన అద్దంకిని పాలించిన ప్రోలయ వేమారెడ్డి ఆస్థానంలో ఉండేవాడు. ఈ కవి 14వ శతాబ్దం వాడు. ఎర్రన హరివంశం, నృసింహ పురాణాలను కూడా రాశాడు. ఆయనకు 'ప్రబంధ పరమేశ్వరుడు', 'శంభుదాసుడు' అనే బిరుదులున్నాయి.

మమత : తాతయ్యా! ఇక్కడ పచ్చిగడ్డి మీద కూర్చుందామా!

(తాతయ్య, పిల్లలు పచ్చిగడ్డి మీద కూర్చుంటారు.)

తాతయ్య : మహాభారతాన్ని తెలుగులో రాసిన ఈ ముగ్గురు కవులను 'కవిత్రయం' అంటారు. పిల్లలూ! మీకు భారత కథల పుస్తకాలు కొన్ని ఇస్తాను. వాటిని చదవండి.

మాధవి: ఇంకా విగ్రహాలు ఉన్నాయిగా తాతయ్యా! వాటిని గురించి చెప్పు

తాతయ్య : చీకటి పడుతోంది. ఇంటికి వెళ్దాం పదండి. ఈసారి వచ్చినప్పుడు మరికొన్ని విగ్రహాలను గురించి చెప్పుకుందాం.



# 19. కూచిపూడి నాట్యం

లలిత కళలు మనకు ఆనందాన్ని, ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. లలిత కళలు ఐదు. అవి కవిత్వం, సంగీతం, నాట్యం, శిల్పం, చిత్రలేఖనం. పిల్లలూ! మీరు నాట్యాన్ని ఇంతకు ముందు చూసే ఉంటారు. మీలో నాట్యాన్ని నేర్చుకునేవారు కూడా ఉంటారు. నాట్యంలో భరతనాట్యం, కూచిపూడి నాట్యం, కథక్, కథాకళి, మణిపురి, ఒడిస్సీ వంటి నాట్య రీతులు ఎన్నో ఉన్నాయి. వీటిలో కూచిపూడి నాట్యం గురించి తెలుసుకుందాం.

తెలుగువారు ఎంతో గర్వంతో చెప్పుకునే కళ కూచిపూడి నాట్యం. ఈ నాట్యం కృష్ణా జిల్లా కూచిపూడి గ్రామంలో ఆవిర్భవించింది. జాతీయ, అంతర్జాతీయ ప్రఖ్యాతినార్జించిన ఈ కూచిపూడి నాట్యాన్ని వివిధ ప్రాంతాల్లో ఎందరో కళాకారులు ప్రదర్శిస్తున్నారు. పురుషులే స్త్రీ పాత్రలను కూడా అభినయించడం కూచిపూడి సంప్రదాయం. ఇప్పటికీ కొందరు పురుషులు సంప్రదాయసిద్ధంగా స్త్రీ పాత్రలను అభినయిస్తున్నారు. అలాగే పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మ సత్యభామగా, ఉషగా అభినయిస్తూ పలువురి కళాభిమానుల ప్రశంసలు అందుకుంటున్నారు.







ఆధునిక కాలంలో పురాణ కథలే కాకుండా సామాజిక సమస్యలకు దర్పణం పట్టే నృత్య నాటికలను కూడా కళాకారులు ప్రదర్శిస్తున్నారు. ప్రముఖ నర్తకి శోభానాయుడు సమాజంలోని సమస్యలను ఇతివృత్తంగా తీసుకుని నాటకాలను రూపొందిస్తున్నారు. రవీంద్రనాథ్ టాగూరు రాసిన "చండాలిక" నాటికను ఎస్.వి. భుజంగరాయ శర్మ కూచిపూడి నాట్య సంప్రదాయానికి అనుగుణంగా రచించారు. ఈ నృత్య నాటికను శోభానాయుడు బృందం వారు ప్రదర్శిస్తున్నారు.

ప్రముఖ నాట్యాచార్యుడు డాక్టర్ వెంపటి చిన సత్యం, నర్తకి శోభానాయుడు వంటి కళాకారులు వివి పట్టణాల్లో కూచిపూడి నాట్య శిక్షణ కేంద్రాలను స్థాపించారు. కూచిపూడిలోని సిద్ధేంద్ర కళాక్షేత్రంలో హైదరాబాద్‌లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు కూచిపూడి నాట్యం నేర్పుతున్నారు. అఖి భారత కూచిపూడి నాట్య కళామండలి వారు ప్రతియేటా జాతీయ స్థాయిలో కూచిపూడి నాట్యోత్సవాలను నిర్వహిస్తున్నారు. ఈ నాట్యంలో నాట్యం, గానం, నట్టువాంగం ఉంటాయి. గాయకుడు గానం చేస్తుంటాడు. నాట్యాచార్యుడు నట్టువాంగం చేస్తుంటాడు. గాయకుడు పాడే పాటకు, నాట్యాచార్యుడు వేసే తాళాని అనుగుణంగా కళాకారిణి అభినయిస్తూ నాట్యం చేస్తుంది.

కూచిపూడి నాట్యాన్ని సిద్ధేంద్ర యోగి అభివృద్ధి చేశాడు. సిద్ధేంద్రుడు రచించిన 'భామాకలాపం' సుప్రసిద్ధమైనది. శ్రీకృష్ణునిపై సిద్ధేంద్రునికి ఉన్న భక్తి భావం ఈ భామాకలాపంలో కనబడుతుంది. ఆయన గొప్ప నాట్య శాస్త్రవేత్త. 15వ శతాబ్దం ప్రాంతంలో ఈ కళను ప్రాచుర్యానికి తీసుకుని వచ్చాడు. కూచిపూడి వారికి కులపతి అయ్యాడు. యువకుడిగా ఉన్నప్పుడే సన్యాసాశ్రమం స్వీకరించాడు. యోగి అయ్యాడు. తరువాతి కాలంలో చింతా కృష్ణమూర్తి, వసుమర్తి కృష్ణమూర్తి, వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి వంటి వారు ఎందరో కూచిపూడి కళాకారులు, నాట్యాచార్యులు ఈ నాట్యానికి సేవలు అందించారు. కూచిపూడి కళాకారులు ఉషా పరిణయం, క్షీరసాగర మథనం, పార్వతీ కల్యాణం, భక్త ప్రహ్లాద వంటి నాటకాలను కళాత్మక దృష్టితోనే కాకుండా భక్తి భావంతో ప్రదర్శిస్తారు.

ఈనాడు కూచిపూడి నాట్యం భారతదేశ నాట్య రీతులలో ఒకటిగా చలామణి అవుతోంది. తెలుగు జాతికి గర్వకారణమైంది.

## 20. వినదగునెవ్వరు చెప్పిన

1. వినదగు నెవ్వరు సెప్పిన
విని నంతనె వేగపడక వివరింపదగున్
గనికల్ల నిజము దెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!



పద్యంలోని పదాలు : వినదగు, ఎవ్వరు, చెప్పిన, వినిన, అంతనె, వేగపడక, వివరింపన్, తగున్, కని, కల్ల, నిజము, తెలిసిన, మనుజుడె, పో, నీతిపరుడు, మహిలో, సుమతీ.

భావం : ఎవరు చెప్పినా వినాలి. వినగానే తొందరపడక నిదానంగా ఆలోచించాలి. అట్లా ఆలోచించి సత్యమేదో? అసత్యమేదో? తెలుసుకున్నవారే విచక్షణ కలిగినవారు.

2. దొంగ పాలు కాదు దొడ్డ కీర్తిని దెచ్చు
పరమ సౌఖ్యమిచ్చు భద్రమిచ్చు
యాచకునకు నీయ నావంత తరుగదు
విద్యబోలు ధనము పృథివి గలదె !

పద్యంలోని పదాలు : దొంగ, పాలు, కాదు, దొడ్డ, కీర్తిని, తెచ్చు, పరమ సౌఖ్యము, ఇచ్చు, భద్రము, ఇచ్చు, యాచకునకు, ఈయున్, ఆవంత, తరుగదు, విద్య, పోలు, ధనము, పృథివి, కలదె.



భావం : విద్య దొంగల పాలు కాదు. మనకు గొప్ప కీర్తిని తెస్తుంది. సుఖాన్ని ఇస్తుంది. భద్రతను ఇస్తుంది. విద్యను అడిగినవాడికి ఇచ్చినా కొంచెం కూడా తగ్గదు.

3. బహుళ కావ్యములను పరికింపగా వచ్చు
బహుళ శబ్దచయము బలుకవచ్చు
సహన మొక్కటబ్బ చాల కష్టంబురా
విశ్వదాభిరామ వినుర వేమ.

పద్యంలోని పదాలు : బహుళకావ్యములను పరికింపగా వచ్చును. బహుళశబ్దచయము, పలుకవచ్చు, సహనము, ఒక్కటి, అబ్బ, చాల, కష్టంబురా, విశ్వదాభిరామ, వినుర, వేమ.

భావం : చాలా కావ్యాలను చదువవచ్చును. అనేక మాటలు నేర్వవచ్చును. కానీ ఓర్పును అలవరచుకోవడం చాలా కష్టం.



4. అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండు బల్కు జల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినుర వేమ.

పద్యంలోని పదాలు : అల్పుడు, ఎపుడు, పల్కును, ఆడంబరముగాను, సజ్జనుండు, పల్కును, చల్లగాను, కంచు, మ్రోగునట్లు, కనకంబు, మ్రోగునా, విశ్వ . . . . . . . . . . . . . . . . . . . .

భావం : నీచుడు ఆడంబరంగా మాట్లాడతాడు. మంచివాడు నెమ్మదిగా మాట్లాడతాడు. కంచు మోగేట్టు బంగారం మోగదు కదా !



5. మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్ట విప్పి చూడ బురుగులుండు
బిరికివాని మదిని బింకమీలాగురా
విశ్వదాభిరామ వినుర వేమ.

పద్యంలోని పదాలు : మేడిపండు, చూడ, మేలిమి అయి, ఉండును, పొట్ట, విప్పి, చూడ, పురుగులు, ఉండును, పిరికివాని, మదిని, బింకము, ఈలాగురా, విశ్వ. . . . . . . . . . . . . . . . . . . .

భావం : మేడిపండు పైకి చక్కగా కనపడుతుంది. విప్పి చూస్తే పొట్ట లోపల పురుగులుంటాయి. అట్లాగే పిరికివాడు పైకి బింకంగా కనపడినా మనసులో భయమే ఉంటుంది.

6. సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్పు
గౌరవమొసంగు జనులకు గలుషమడచు
గీర్తి బ్రకటించు చిత్తవిస్ఫూర్తి జేయు
సాధు సంగంబు సకలార్థ సాధనంబు.

పద్యంలోని పదాలు : సత్య సూక్తి, ఘటించు, ధీజడిమ, మాన్పు, గౌరవము, ఒసంగు, జనులకు, కలుషము, అడచును, కీర్తిని, ప్రకటించు, చిత్తవిస్ఫూర్తి, చేయు, సాధు సంగంబు, సకల + అర్థ సాధనంబు.

భావం : మంచివారి స్నేహం మంచి మాటలు నేర్పుతుంది. బుద్ధిమాంద్యాన్ని పోగొడుతుంది. గౌరవాన్ని కలిగిస్తుంది. చెడును తొలగిస్తుంది. కీర్తిని ఇస్తుంది. మనసు వికసింప జేస్తుంది. ఇలా అది చేయజాలనిది లేదు.



7. తివిరి యిసుమున దైలంబు దీయవచ్చు
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు
దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు
జేరి - మూర్ఖుల మనసు రంజింపరాదు.

పద్యంలోని పదాలు : తివిరి, ఇసుమున, తైలంబు, తీయవచ్చు, తవిలి, మృగతృష్ణలో, నీరు, త్రాగవచ్చు, తిరిగి, కుందేటికొమ్ము, సాధింపవచ్చు, చేరి, మూర్ఖుల, మనసు, రంజింప రాదు.

భావం : ప్రయత్నంతో ఇసుక నుండి నూనె తీయవచ్చు. ఎండమావిలో నీరు తాగవచ్చు, కుందేటి కొమ్మును సంపాదించవచ్చును. ఇవి అసాధ్యాలు, అయినా కష్టపడి సాధించవచ్చేమో ! కానీ మూర్ఖుల మనసును మాత్రం ఒప్పించలేము.

8. తరువులతి రసఫల భార గురుత గాంచు
నింగి వ్రేలుచు నమృత మొసంగుమేఘు
డుద్ధతులుగారు బుధులు సమృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.



పద్యంలోని పదాలు : తరువులు, అతి రస ఫల భార గురుత, కాంచు, నింగి, వ్రేలుచు, అమృతము, ఒసంగు, మేఘుడు, ఉద్ధతులు, కారు, బుధులు, సమృద్ధి చేత, జగతి, ఉపకర్తలకు, ఇది, సహజ గుణము.

భావం : పండ్ల బరువుతో చెట్లు వంగుతాయి. ఆకాశంలో వేలాడుతూ మేఘం వర్షాన్నిస్తుంది. సంపద ఎంత ఉన్నా ఉత్తములు గర్వపడరు. ఇతరులకు ఉపకారం చేసేవారికి ఇవి సహజగుణాలు.

# 21. తెలుసుకుందాం!

(ఉట్నూర్ పాఠశాల, సాయంత్రం 4 గంటలు)

జాన్ని (టీచరు) : అంగూ, ఇస్రూ, సత్తుబాయి, అంగూబాయి మీరట్ లెక్కలు కీతిత్?

సత్తుబాయి : కీతిత్, సార్!

జాన్ని : నిమ్మె ఉష్ణా! నేన్ బతల్ కీకట్?

పిల్లలు : బన్‌తేరి వేయుడి వెహాట్ సార్!

భీంరావ్ : రాం రాం సార్! మన బడి ముందు ఏదో బస్సు ఆగింది. బస్సు దిగి ఎవరో ఇటువైపే వస్తున్నారు సార్!

రఘు (టీచరు) : నమస్కారం సార్! మేము తాడ్వాయి పాఠశాల, వరంగల్ జిల్లా నుండి విజ్ఞాన విహార యాత్రకు వచ్చాం.

జాన్ని : ఓహో అలాగా! నా పేరు జోసఫ్ జాన్ని. ఈ పాఠశాలలో టీచరుగా పని చేస్తున్నాను. వీరు మా పాఠశాల పిల్లలు.

పిల్లలు : రాం! రాం! సార్!

జాన్ని : మీకు నమస్కారం చెప్తున్నారు. గోండు భాషలో రాం! రాం! అంటే నమస్కారం.

★ ★ ★ ★ ★

రఘు : మా అందరికి చక్కటి బస ఏర్పాటు చేసినందుకు కృతజ్ఞతలు. జాన్ని సార్! మా పిల్లలంతా ఇక్కడి గిరిజనుల గురించి తెలుసుకోవాలని చాలా ఉత్సాహంగా ఉన్నారు. దయచేసి వారి గురించి చెబుతారా?

జాన్ని : గోండు జాతి గిరిజనులు ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. వీరి వృత్తి వ్యవసాయం. వీరి భాష గోండు భాష. వీరు మర్యాదకు, క్రమశిక్షణకు మారుపేరు. నమ్మినవారికి ప్రాణమివ్వడానికైనా వెనుకాడరు. కొత్తవారెవరైనా గ్రామానికి వస్తే రాం! రాం! అని ఆహ్వానిస్తారు. చెప్పులు ధరించి ఇండ్లలోకి వెళ్లరు. ఎందుకంటే ఇళ్లను వీరు దేవతా గృహాలుగా భావిస్తారు.

మహేశ్ (విద్యార్థి) : సార్! మరి వీళ్ల గోండు భాషలోనే రాస్తారా?

జాన్ని : గోండు భాషకు లిపి లేదు. దీనికి కుర్రం హనుమంతరావు లిపిని రూపొందించాడు. ఇది ఉపయోగంలోకి రావల్సి ఉంది. ఇక్కడి వారంతా గోండు భాషనే మాట్లాడతారు.

రఘు : కానీ ఈ పిల్లలు తెలుగులో కూడా చక్కగా మాట్లాడుతున్నారే!

చిలకమసెళ్ళ

జార్జి : అవును. ఇప్పుడు వీరంతా చక్కటి తెలుగు మాట్లాడతారు. రాస్తారు కూడా. మొదట్లో వీరెవరు తెలుగులో మాట్లాడేవారు కాదు.

వాసు (టీచర్) : మరి ఇప్పుడు తెలుగులో ఎలా మాట్లాడుతున్నారు?

జార్జి : ఇంతకుముందు నేను హస్నాపూర్ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పని చేసేవాడిని. అక్కడ పిల్లలూ, పెద్దలూ గోండు భాషలోనే మాట్లాడేవారు. నాకేమో గోండు భాష రాదు. నేను తెలుగులో మాట్లాడితే వారికేం అర్థమయ్యేదికాదు. నాతో బెరుకుగా ప్రవర్తించేవారు. అందువల్ల మొదట నేనే గోండు భాషను నేర్చుకోవాలని నిశ్చయించుకున్నాను. తరచుగా వారి ఇళ్లకు వెళ్లేవాడిని. వారి పండుగలలో, ఉత్సవాలలో పాల్గొనేవాడిని. క్రమంగా వారిలాగే గోండు భాషలో మాట్లాడే నైపుణ్యాన్ని పెంచుకున్నాను. వాళ్లలో ఒకడిగా ఉంటూ వారి బెరుకుని పోగొట్టాను. క్రమంగా వారికి వారి భాష ఆధారంగా తెలుగు నేర్పగలిగాను.

జంగుబాయి : అవునండీ! మా సార్ మాతోపాటు నేలపైనే కూర్చుంటాడు. మాతో కలిసి తింటాడు. ఆటలు ఆడతాడు. పాటలు పాడతాడు. మాకు ఇంటి కంటే ఇక్కడే ఎంతో బాగుంటుంది.

ఇస్రూబాయి : అంతేకాదు! పాఠాలు కూడా ఆటలు, పాటలు, కథల రూపంలో చెప్తాడు. పాఠాలకు సంబంధించి మంచిమంచి వస్తువులు తయారు చేస్తాడు. మాతో చేయిస్తాడు. ఈ గోడలపై ఉన్నవన్నీ మేం తయారు చేసినవే!

జార్జి : దీనికి ఉపాధ్యాయ కేంద్ర సమావేశాలు, శిక్షణ కార్యక్రమాలు ఉపయోగపడ్డాయి.

సత్తుబాయి : మొదట్లో మాకు సారంటే భయమన్పించేది. కాని సారు మాలాగే గోండు భాషలో మాట్లాడేసరికి మాకు భలే సంతోషమన్పించేది. ఇప్పుడు మాకంటే సారు మా భాషలో బాగా మాట్లాడతాడు. మా పరిశుభ్రత, మంచి ఆహారపు అలవాట్లు, ఆరోగ్యపు అలవాట్ల గురించి ఎంతో శ్రద్ధ వహిస్తాడు. సార్ వల్ల మా తల్లిదండ్రులు కూడా రాత్రి బళ్లలో చదువుకుంటున్నారు.

జార్జి : గిరిజన పిల్లలు చాలా చురుకైనవారు. రాష్ట్ర స్థాయి ఆటల పోటీల్లో, ఉపన్యాస, వ్యాసరచన, డ్రాయింగ్ పోటీల్లో పాల్గొని ఎన్నో బహుమతులు గెల్చుకున్నారు.

ప్రేమలీల (టీచరు) : వీరికి చదువు చెప్పడం కోసం మీరు ఎంతో కష్టపడ్డారు. గోండు భాషను నేర్చుకుని వారితో కలిసిపోయారు. వారి తల్లిదండ్రుల్లో కూడా మార్పు తీసుకువచ్చారు. మీరు నిజంగా అభినందనీయులు.

మహేశ్ : వీరు ఏఏ దేవుళ్లను పూజిస్తారు?

జార్జి : పెర్సాపేన్, ఆకిపేన్, అవ్వల్‌పేన్ దేవుళ్లను పూజిస్తారు. వీళ్లంతా గ్రామ దేవతలు.

షణ్ముఖి (విద్యార్థిని) : మిగిలిన గిరిజన జాతుల గురించి కూడా చెప్పండి సార్!

జార్జి : మిగతావారిలో కొలాం, తోటి, ప్రధాన్ తెగల వారు ముఖ్యమైనవారు. కొలాంలు మాట్లాడే భాష 'కొలామీ'. వీరి వేషభాషలు సైతం ప్రత్యేకంగా ఉంటాయి. వెండి, రాగి ఆభరణాలు ధరిస్తారు. ఒంటినిండా పచ్చబొట్లు ఉండడం అందంగా భావిస్తారు. వెదురుతో తట్టలు, బుట్టలు, గుమ్ములు, తడికలు తయారు చేస్తారు. తేనె, జిగురు, ఇప్పపువ్వు, విస్తరాకులు సేకరించి అమ్ముతారు. వ్యవసాయం కూడా చేస్తారు. వీరు భీందేవుడు, పోలకమ్మ, బుర్రి దేవతలను పూజిస్తారు.

ప్రేమలీల : తోటి, ప్రధాన్ తెగలవారు ఏం చేస్తారు?

జార్జి : తోటి తెగవారు సంచార జీవనం గడుపుతుంటారు. జాని గింజలతో పచ్చబొట్లు పొడవడం వీరి ప్రత్యేకత. వీరిని పాండవరాజుల కథలు చెప్పేవారని కూడా అంటారు. గోండు భాష మాట్లాడతారు. ప్రధాన్ తెగవారు కూడా గోండు గ్రామాల్లోనే ఉంటారు. మరాఠీ మాట్లాడతారు. సన్నాయి వాయించడం, డప్పుకొట్టడం వీరి ఆచారం. ప్రస్తుతం వీరు వ్యవసాయ వృత్తిని ఎన్నుకొన్నారు.

వాసు : ఏఏ జాతరలు జరుపుకొంటారు?

జంగుబాయి : జంగుబాయి లోయలో జంగుబాయి జాతర, కేస్లాపూర్‌లో నాగోబా జాతర, శాంపూర్‌లో బుడుందేవ్ జాతర, నార్నూర్‌లో ఖాందేవ్ జాతర, సిర్పూర్(యు)లో మహదేవ్ జాతరలు జరుపుకొంటారు. నాయక్‌పోడువారు మందమర్రి సమీపంలో గాంధారి మైసమ్మ జాతరకు వెళ్తారు.



రఘు : నాగోబా జాతర ఇక్కడ చాలా ప్రసిద్ధమైంది కదా! దీన్ని ఎప్పుడు జరుపుకొంటారు?

జార్జి : ప్రతి ఏటా పుష్యమాసం అమావాస్య రోజున నాగోబా దేవాలయం వద్ద నిర్వహిస్తారు. ఇతర రాష్ట్రాల నుండి కూడా గిరిజనులు వస్తారు. ఇది గిరిజన సంస్కృతికి అద్దం పడుతుంది.

మహేశ్ : సార్! వీరంతా ఏఏ పండుగలు జరుపుకొంటారు?

సత్తుబాయి : చైత్ర మాసంలో 'చెంచు భీమన్న మెర్మి' పండుగ, వైశాఖ మాసంలో పెర్సాపేన్ పూజలను, జ్యేష్ఠ మాసంలో 'విదిరి మొహాతుక్' పండుగను, ఆషాఢ మాసంలో అకిపేన్ పూజలను,



గుస్సాడి నృత్యం - వేషధారణ

శ్రావణం పూర్తయిన తర్వాత పొలాల పండుగను, భాద్రపద మాసంలో పెత్రమాస (పెద్దల పండుగ)ను, మృగశిర మాసంలో పంటలు ఇంటికి వచ్చిన సందర్భంగా 'పెట్టి' పండుగను జరుపుకుంటారు. దసరా, దీపావళి, ఉగాది, హోళీ పండుగలు కూడా జరుపుకొంటారు. దసరా నుండి దీపావళి వరకు జరుపుకునే పండుగ 'దండారి'. ఈ సందర్భంగా గుస్సాడి నృత్యం చేస్తారు.

వసుమతి : ఇక్కడి గిరిజనులు ఏవి పంటలు పండిస్తున్నారు?

రింకిత్ : మా దగ్గర గోధుమ, జొన్న, ప్రత్తి మొదలయిన పంటలను పండిస్తారు. మల్బరీ తోటలను, పండ్ల తోటలను, ఆముదం చెట్లను పెంచుతారు.

ఇస్రాబాయి : వరంగల్ జిల్లాలో జరిగే జాతర గురించి చెప్పండి.

రవి : మా దగ్గర సమ్మక్క-సారలమ్మ జాతర ప్రసిద్ధమైంది. ఇది రెండు సంవత్సరాలకు ఒకసారి మేడారంలో జరుగుతుంది. ఇది తాడ్వాయి మండల కేంద్రం నుండి 15 కి.మీ. దూరంలో ఉంది. దాదాపు 40 లక్షల మంది వస్తారు. మన రాష్ట్రం వాళ్లే కాక మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలవారు ఈ జాతరకు వస్తారు. ఇది ప్రధానంగా కోయ గిరిజనులకు చెందిన జాతర. ఇతర గిరిజనులు, గిరిజనేతరులు కూడా రావడం దీని ప్రత్యేకత.



సమ్మక్క గద్దె



సారలమ్మ గద్దె →

జంగుబాయి : ఇన్ని లక్షల మంది వస్తే ఇబ్బందులు ఏర్పడవా?

వాసు : అందుకే మేడారం వరకు రోడ్డు సౌకర్యం, బోర్ బావుల ద్వారా నీటి సౌకర్యం, అంటురోగాలు ప్రబలకుండా వైద్య శిబిరాలు ఏర్పరుస్తారు. ప్రత్యేక బస్సు సౌకర్యం ఏర్పాటు చేస్తారు. మీరు కూడా మీ పిల్లలతో మేడారం జాతరకు రండి. మా బడిలోనే మీకు బస ఏర్పాటు చేస్తాం.

రము : ఆదిలాబాద్ గిరిజన సంస్కృతి గురించి, జాతరల గురించి చాలా విషయాలు చెప్పారు. కృతజ్ఞతలండీ ! పిల్లలూ మీకు కూడా రాం! రాం!.

పిల్లలు : రాం! రాం!

## ఇవి చేయండి.

**అ.** మీ పరిసర ప్రాంతాల్లో జరిగే ఉత్సవాలు / జాతరల గురించి చెప్పండి.

**ఆ.** **కింది గోండు పదాలకు తెలుగు పదాలు ఉన్నాయి. వీటి ఆధారంగా పాఠంలో ఉన్న గోండు వాక్యాలకు తెలుగు వాక్యాలు రాయండి.**

మీరట్ = మీరు, నిమ్మె = నీవు, నేన్డ్ = ఈ రోజు, బద్‌తెరె = ఏదైనా, వేసుడి = కథ, కీలిటికి = చేశారా, వెహట్ = చెప్పండి, బతల్ = ఏమి, కీకట్ = చేద్దాం, ఉద్ద = కూర్చో.

**ఇ.** **కింది పేరాను చదివి వీలైనన్ని ప్రశ్నలు రాయండి.**

మేడారం జాతర మాఘ శుద్ధ పౌర్ణమి వచ్చే బుధ, గురు, శుక్ర వారాల్లో జరుగుతుంది. మేడారంలో సమ్మక్క గద్దె, సారలమ్మ గద్దెలు ఉన్నాయి. ఇక్కడికి 2 కి.మీ.ల దూరంలో చిలకల గుట్ట ఉంది. ఇక్కడే సమ్మక్క భరిణె ఉంటుంది. గిరిజన పూజారులు దీనిని భక్తిశ్రద్ధలతో, సంప్రదాయ పద్ధతిలో తీసుకొని వస్తారు. ఈ భరిణెను సమ్మక్క గద్దెపై ఉంచుతారు. జాతర పూర్తయిన పిదప తిరిగి దీనిని చిలకల గుట్టపైకి తీసుకెళ్తారు. భక్తులంతా జంపన్న వాగులో స్నానాలు చేస్తారు. దీని కోసం లక్నవరం చెరువు నుండి జంపన్న వాగులోకి నీరు వదుల్తారు. భక్తులు తమ మొక్కుల కోసం బరువుకు తగ్గ బెల్లం సమర్పించడం ఇక్కడి ఆచారం.



పూజా కార్యక్రమం →

# 22. తెలుగు సంవత్సరాలు



పోస్ట్ ...

కేక వినపడగానే పరుగెత్తుకుంటూ వెళ్లింది రాణి. పోస్ట్‌మాన్ ఇచ్చిన శుభలేఖ అందుకుని ఇంట్లోకి పరిగెత్తింది. శుభలేఖను తల్లి జానకమ్మకు ఇచ్చింది. జానకమ్మ శుభలేఖను చదివింది. అది వాళ్ల బాబాయి కొడుకు శేఖర్ వివాహ ఆహ్వాన పత్రిక. వివాహ స్థలం వాళ్ల గ్రామానికి 60 కిలోమీటర్ల దూరంలో ఉంది. రైలు మీద వెళ్లాలి. రైలు ప్రయాణం అంటే రాణికి ఎంతో ఇష్టం. ఆమె ఆనందానికి అవధులు లేవు. ప్రయాణం వచ్చే ఆదివారమే !

ఆదివారం రానే వచ్చింది. తల్లీకూతుళ్లు ప్రయాణమై ఆటోలో స్టేషనుకు వెళ్ళారు. టిక్కెట్టు కొనుక్కొని రైలెక్కారు. రైలు బయలుదేరింది. వేగాన్ని పుంజుకుంది. రైలు ముందుకు పోతుంటే దారి పక్కన ఉన్న చెట్లు వెనక్కుపోతూ ఉన్నట్లనిపించింది రాణికి. జానకమ్మ శుభలేఖను తీసుకొని మరొకసారి ముహూర్తం చూసింది. రాణి కూడా శుభలేఖను చదివింది.

శుభలేఖలో ప్రమాది నామ సంవత్సరం అని ఉంది. "అమ్మా ! ఇది 1999వ సంవత్సరం గదా! అలా రాశారేమిటి?" అని రాణి అడిగింది.

"ఓహో! అదా!

రాణీ ! ప్రమాది అనేది తెలుగు సంవత్సరం పేరు. సంవత్సరానికి ఎన్నిరోజులో తెలుసా? సంవత్సరం అంటే 365 రోజులన్నమాట. సంవత్సర కాలాన్ని ఎలా లెక్కిస్తారో తెలుసా నీకు. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతుంది. భూమి సూర్యుని చుట్టూ ఒకసారి తిరిగి రావడానికి పట్టే కాలాన్ని సంవత్సరం అంటారు. ఈ సంవత్సరాలకు మన పెద్దలు ఒక్కొక్క సంవత్సరానికి ఒక్కొక్క పేరు పెట్టారు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. ప్రభవ | 2. విభవ | 3. శుక్ల | 4. ప్రమోదూత |
| 5. ప్రజోత్పత్తి | 6. అంగిరస | 7. శ్రీముఖ | 8. భావ |
| 9. యువ | 10. ధాత | 11. ఈశ్వర | 12. బహుధాన్య |
| 13. ప్రమాది | 14. విక్రమ | 15. వృష | 16. చిత్రభాను |
| 17. స్వభాను | 18. తారణ | 19. పార్థివ | 20. వ్యయ |
| 21. సర్వజిత్తు | 22. సర్వధారి | 23. విరోధి | 24. వికృతి |
| 25. ఖర | 26. నందన | 27. విజయ | 28. జయ |
| 29. మన్మథ | 30. దుర్ముఖి | 31. హేవిళంబి | 32. విళంబి |
| 33. వికారి | 34. శార్వరి | 35. ప్లవ | 36. శుభకృతు |
| 37. శోభకృతు | 38. క్రోధి | 39. విశ్వావసు | 40. పరాభవ |
| 41. ప్లవంగ | 42. కీలక | 43. సౌమ్య | 44 సాధారణ |
| 45. విరోధికృతు | 46. పరీధావి | 47. ప్రమాదీచ | 48. అనంద |
| 49. రాక్షస | 50. నల | 51. పింగళ | 52. కాళయుక్తి |
| 53. సిద్ధార్థి | 54. రౌద్రి | 55. దుర్మతి | 56. దుందుభి |
| 57. రుధిరోద్గారి | 58. రక్తాక్షి | 59. క్రోధన | 60. అక్షయ |

ఈ అరవై సంవత్సరాలు ఇదే వరుసలో ఒక దాని తర్వాత ఒకటి వస్తాయి. ఒక వరుస పూర్తి అయిన తర్వాత మళ్లీ మొదలవుతాయి. దీనిని 'షష్టివర్ష చక్రం' అంటారు. ఇలాంటి కొన్ని వేల సంవత్సరాలను కలిపి ఒక 'యుగం' అంటారు.



దాన్ని క్రీస్తుశకం 1999వ

రాణీ! ఇంతకు ముందు నీవు 1999వ సంవత్సరం అన్నావు కదా! సంవత్సరం అని లెక్కిస్తారు. చరిత్రలో ఎప్పుడు ఏం జరిగిందో చెప్పడానికి సంవత్సరాలను వరుసగా లెక్కపెట్టుకోవడం అవసరంకదా! అయితే ఇవి ఎక్కడ నుండి లెక్కపెట్టాలి? అనేది ప్రశ్న. ఏదో ఒక ప్రముఖ సంఘటన జరిగిన నాటి నుండో, ఒక మహాప్రవక్త జన్మదినంనుండో, ఒక మహాచక్రవర్తి సింహాసనం ఎక్కిన రోజు నుండో లెక్కించడం ఆనవాయితి. దీనినే 'శకం' అంటారు. మన దేశంలో శాలివాహన శకం, విక్రమ శకం అనేవి వాడుకలో ఉన్నాయి. శాలివాహన శకం శాలివాహనుడు సింహాసనం అధిష్ఠించిన రోజు నుండి ప్రారంభమయింది. విక్రమ శకం విక్రమార్కుడు సింహాసనం ఎక్కిన రోజు నుండి ప్రారంభమయింది. భిన్న దేశాలకు, జాతులకు ఉపయోగపడేటట్లు 'ఉమ్మడి శకం' వాడతాం. అలాంటిదే 'క్రీస్తు శకం'. ఇది జీసస్ క్రైస్ట్ పుట్టుకతో ప్రారంభమైంది".




"అమ్మో! దీని వెనక ఇంత కథ ఉందన్నమాట. మరి యుగాలు అంటే ఏమిటమ్మా?" అంది రాణి.

"అయితే విను. మనకు కాల పరిమితితో నాలుగు యుగాలు ఉన్నాయి. అవి

ఈ నాల్గింటిని కలిపి మహాయుగం అన్నారు. మహాయుగం కాలం 4320000 సంవత్సరాలు. దీనిలో పదవ వంతు కలి యుగం. కలి యుగానికి రెట్టింపు ద్వాపర యుగం, మూడు రెట్లు త్రేతా యుగం, నాలుగు రెట్లు కృత యుగంగా గుర్తించారు. దీనిని బట్టి ఏ యుగానికి ఎన్ని సంవత్సరాలో నీవు చెప్పు".

ఇంతలో రైలు వాళ్లు దిగవలసిన స్టేషనులో ఆగింది. తల్లీ కూతుళ్లు హడావిడిగా రైలు దిగారు.

తర్వాత రాణి వాళ్లమ్మకు ఏం సమాధానం చెప్పి ఉంటుందో మీరు కూడా లెక్కించి చెప్పండి.